*Photo by:* **S. S. GHATAGE**



SUN-FLOWER

భలే... భలే...
గాబ్లిన్స్
వచ్చేశాయ్!!

PARLE
gobblins

సరికొత్త
గాబ్లిన్స్

ఫ్రూట్ టాఫీలు
ఎంతో సేపు మజా మజాగా...
తినండి ఖుషీ ఖుషీగా

గాబ్లిన్స్ ఫ్రూట్ టాఫీలు నిమ్మ, అనాస, రాస్ప్బెర్రీ
మరియు నారింజ రుచులలో లభిస్తాయి.




everest/734/PP-tl



అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్స్చర్ జీర్ణశక్తిని సరిచేస్తుంది. దానికి తోడ్పడుతుంది. బిడ్డని ఆరోగ్యంగా, సంతోషంగా ఉంచుతుంది

అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్స్చర్ సులినొప్పి, వాయువు, అజీర్ణం పళ్లు వచ్చే కాలంలో ఇబ్బందులు వాటికి మంచి గుణం ఇస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్




## బిడ్డ సంతోషంగా ఉంటె
# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్ వాడినట్లె

OBM:2642 TG

---






# స్వాన్
## జూనియర్ పెన్నులు




అత్యుత్తమ ఫలితాలకోసం వాడండి

**స్వాన్** డీలక్స్ సిరా



**స్వాన్** (ఇండియా)
ప్రైవేట్ లిమిటెడ్
బొంబాయి . న్యూ ఢిల్లీ

heros' SI-142 B TEL

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళ కథ ["ఉత్తమ దానం"] నిజ్జయ్యు రచన.

ప్రపంచంలో ఉన్నవారూ, లేనివారూ అంటూ ఉన్నంత కాలమూ ఉన్నవారు లేనివారికి దానం చెయ్యటం గొప్పవిషయమే. అన్నదానమూ, గోదానమూ, భూదానమూ లాటివి మనిషి అవసరాలకు సంబంధించినవి. అయితే ఈ దానాలు సంపదను పంచుతాయి గాని పెంచవు. సంపదను పెంచేది వృత్తివిద్యాదానం ఒక్కటే. ఇదే ఈ కథలోని నీతి.

సంపుటి 57 ఆగష్టు '75 సంచిక 2





# మిత్రభేదం

## 26

బుద్ధిమంతుడైన వాడు తన మాట అంటే లక్ష్యం లేనివాడికీ, జూదరికీ, తాగుబోతుకూ, చిక్కులలో ఉన్న మూఢుడికీ, ఓటమిచెందిన వాడికీ, ఆశాభంగం చెందిన వాడికీ హితం చెప్పటం తనకే అపాయమని తెలుసుకుంటాడు. చేవ ఎక్కిన కర్ర విరగనైనా విరుగుతుందిగాని వంగదు గదా! అడిగినవాడికే హితం చెప్పాలి గాని, విశ్వాసం లేనివాడికి చెప్పరాదు.

ఒక వనంలో ఒక పిచ్చుకల జంట ఒక చెట్టు కొమ్మ మీద చక్కని గూడు కట్టుకుని ఉంటూండేదిట. ఒక శిశిరంలో చలితో బాటు వాన కురుస్తున్నదిట. అప్పుడొక కోతి వానకు తడిసి, చలికి వణుకుతూ వచ్చి అదే చెట్టు కింద నిలబడిందిట. దాని శరీరం నిలువునా గజగజలాడుతున్నది. దాని దంతాలు టకటకలాడుతున్నాయి.

ఆ సమయంలో గూట్లో ఆడపిచ్చుక మాత్రమే ఉన్నది. అది కోతికి కలిగిన దుస్థితి చూసి, "ఏమోయ్, నీకు మనిషికున్నట్టే మొహమూ, కాళ్ళూ, చేతులూ ఉన్నాయి గదా. మనుషులు కట్టుకున్నట్టే ఒక ఇల్లు కట్టుకోలేకపోయావా? ఎందుకలా చెట్టు కింద నిలబడి, బుద్ధిలేకుండా చలికీ, వానకూ వణికిపోతున్నావు?" అని అడిగింది.

కోతి మండిపడి, "నా కోసం నేనైతే ఇల్లు కట్టుకోలేని మాట నిజమే కాని, ఇలాటి దుర్మార్గురాలి కొంప పీకటం నా చేతిలో పనేగదా," అనుకుని, పిచ్చుక గూడులాగి, తుంచి, ముక్కలు ముక్కలు చేసేసింది.

అట్ట చివరి బొమ్మ

ఆడపిచ్చుక ఎగిరిపోయి ప్రాణాలు దక్కించుకున్నది.

అలాగే సూచీముఖి పిలవని పేరంటంగా కోతికి హితవు చెప్పబోయేసరికి కోతికి ఆగ్రహం వచ్చి, సూచీముఖిని పట్టుకుని రాయికేసి కొట్టి చంపేసింది.

కరటకం దమనకానికి ఈ కథ చెప్పి, "మూఢుడికి వివేకం చెప్పటం నిష్ప్రయోజనం. అలాటి వాడిలో వివేకం జాడీలో దాచి మూత పెట్టిన దీపం లాటిది. నువు పుట్టడమే అలా పుట్టావు. నువు వెనకటి దుష్టబుద్ధి లాటి వాడివి," అన్నది.

"ఏమిటా కథ?" అని దమనకం అడిగింది. కరటకం దుష్టబుద్ధి కథ ఇలా చెప్పింది:



దుష్టబుద్ధి కథ

ఒక పట్టణంలో దుష్టబుద్ధీ, ధర్మబుద్ధీ అని ఇద్దరు వైశ్యయువకులు ఉండేవారు. ఇద్దరూ మంచి స్నేహితులు. ధర్మబుద్ధి చాలా మంచివాడూ, నిజాయితీపరుడూను. కాని దుష్టబుద్ధి అనేక రకాల దుష్ప్రవర్తనగలవాడని ధర్మబుద్ధికి తెలియదు.

అంతులేని తన వ్యసనాలు తీరటానికి పుష్కలంగా డబ్బు సంపాదించగోరి, దుష్టబుద్ధి ధర్మబుద్ధిని వర్తకం కోసం దూర దేశాలకు పోదామని పిలిచాడు.

"కొత్త కొత్త దేశాలు చూసి, మంచి లాభాలు సంపాదించటానికి ఇది మంచి అవకాశం. వయసులోనే ప్రపంచం చూడకపోతే ముసలితనంలో జ్ఞాపకం చేసుకునేటందుకు ఏమీ ఉండదు. ప్రపంచంలో ఎన్ని భాషలున్నాయో, ఎన్ని రకాల వస్త్రధారణలూ, ఆచారాలూ ఉన్నాయో తెలుసుకోని జన్మ ఏం జన్మ? దేశాంతరాలు చూస్తేనేగాని జ్ఞానమూ, సంపదా, కళా పెంపొందవు. పోదాం పద!" అన్నాడు దుష్టబుద్ధి.

ధర్మబుద్ధి సరే నన్నాడు.

ఇద్దరూ మంచి ముహూర్తాన బయలుదేరి, క్షేమంగా ఒక తెలియని దేశం

చేరారు. అక్కడ వాళ్లు పర్యటన చేస్తూం డగా, ధర్మబుద్ధికి వెయ్యి బంగారు నాణాలుగల పాత్ర నిక్షేపం దొరికింది.

అతను దుష్టబుద్ధితో, "మన అదృష్టం బాగున్నది. మనం ఇంటికి తిరిగి పోదాం పద. ధనం కోసమో, విద్య కోసమో, కళ కోసమో దేశాంతరం వెళ్లిన వాడికి అది లభించగానే స్వదేశం మీద గాలి మళ్లటం సహజం," అన్నాడు.

అందుకు దుష్టబుద్ధి వెంటనే ఒప్పు కున్నాడు. ఇద్దరూ స్వదేశానికి తిరిగి వచ్చారు.

వాళ్లు తమ ఊరు చేరవస్తూండగా ధర్మబుద్ధి దుష్టబుద్ధితో, "మిత్రమా, దొరికిన దానిలో నీ సగం నువు తీసుకో. త్వరలోనే మనం మనవాళ్లను చేరుకుని పండగ చేసుకోబోతున్నాం," అన్నాడు.

దురాశ మనసులో పెట్టుకున్న దుష్ట బుద్ధి, "మిత్రమా, ఇంత డబ్బు ఒక్క సారిగా మన బంధువులకూ, స్నేహితు లకూ చూపడం అంత మంచిది కాదు. వాళ్లు దాన్ని కోరుతారు. అదీగాక, వివేకి అయినవాడు, తనకు కొద్ది సంపదే ఉన్న ప్పటికీ, దాన్ని ప్రదర్శించడం అనుచితం. డబ్బు పాపిష్ఠిది. అది తపస్వులను సైతం చలింపజేస్తుంది. అది అలా ఉంచి, ఈ బంగారం మన ఉమ్మడి సొత్తుగా ఉన్నంత కాలమూ మన స్నేహబంధం మరింత దృఢంగా ఉంటుంది. అందుచేత ఇప్పుడు మనం చెరొక నూరు నాణాలూ తీసుకుని, మిగిలిన ఎనిమిది వందలూ పాత్రతో సహా అరణ్యప్రదేశంలో రహస్యంగా పాతిపెడదాం. అలా చేయటం వల్ల, ఈ పెన్నిధి మనకు అచ్చి వచ్చేదీ, లేనిదీ కూడా తెలిసిపోతుంది. మనకు అవసరం కలిగినప్పుడల్లా వచ్చి ధనం కొంచెం కొంచెంగా తీసుకుపోతూ ఉండ వచ్చు," అన్నాడు.

ధర్మబుద్ధికి అనుమానం కలగలేదు. ఇద్దరూ అరణ్యంలో ఒక నిర్జన ప్రాంతానికి వెళ్లి, అక్కడ నిధిని పాతిపెట్టి, తమ ఇళ్లకు తిరిగి వచ్చేశారు.





# విచిత్రకవలలు

## 14

[రాక్షసుడి చేత బావిలో పడవేయబడిన ఉదయనుడు, తన దగ్గిరవున్న మంత్రపు నంచి సాయంతో, అందులోంచి బయటపడ్డాడు. తరవాత అతడు శ్రావస్తినగరానికి పోయి రాజుకు, రాజకుమార్తెల క్షేమం సంగతిచెప్పి, తిరిగి మాయాభవనానికి వచ్చాడు. అక్కడ అతడికొక చెట్టుకొమ్మకు వేళ్ళాడుతూ అయిదు ఉరితాళ్ళూ, రాక్షసుడూ కనిపించారు. తరవాత—]

ఉదయనుడు ఆ భయంకర దృశ్యం చూసి గజగజలాడిపోయాడు. ఏమి చెయ్యటానికీ అతడికి పాలుపోలేదు. పోనీ, అదృశ్యరూపం పొంది బంధింపబడిన వాళ్ళను విడిపిద్దామన్నా వీలులేని పరిస్థితి ఏర్పడింది. ఎందువల్లనంటే, శ్రావస్తి నుంచి తిరిగి వచ్చేటప్పుడు, అతను దురదృష్టవశాత్తూ తెల్లభస్మం కాస్తా పోగొట్టుకున్నాడు. అందుచేత, తన సోదరులూ వాళ్ళూ మరొక్క క్షణంలో ఉరి తీయబడతారని తెలిసి కూడా, ఉదయనుడు చాటున పొంచి చూస్తూ వుండిపోవలసి వచ్చిందే కాని, మరో మార్గం కనిపించలేదు. అతడికి ముచ్చెమటలు పోసినై. క్షణమొక యుగంలా గడుస్తోంది.

ఇంతలో రాక్షసుడు, తాను బంధించిన వాళ్ళనందరినీ చెట్టు దగ్గిరకు తీసుకుపోయాడు. వాళ్ళ మెడలకు ఉరితాళ్ళు



తగిలించివేశాడు. చాటున వున్న ఉదయ నుడు ముందుకు ఉరకబోయేంతలో, '' ఆగు !'' అన్న కేక వినిపించింది.

ఉదయనుడు విస్తుపోయి చూడ సాగాడు. ఆ కేక పెట్టినది ఎవరు? గడ్డపువాడే! వాడు, రాక్షసుడితో యిలా చెబుతున్నాడు: '' వీళ్ళను రక్షిద్దామనే ఉద్దేశ్యంతో యిన్నాళ్ళూ ఒక రహస్యం నీతో చెప్పకుండా దాచాను. కాని, అది దాచికూడా వీళ్ళను రక్షించలేకపోయాను. పైగా యిప్పుడు నా ప్రాణాలకే ముప్పు వచ్చింది. కనుక, ఇక దాచను. ఇంత కాలమూ నిన్నూ, నన్నూ మోసపుచ్చుతూ వచ్చిన, ఈ ముగ్గురు కుర్రవాళ్ళూ కవలలు, '' అని యింకా ఏమో చెప్ప బోయాడు.

రాక్షసుడు, గడ్డపువాడి మాటలకు అడ్డంవచ్చి, '' ఏమిటీ, వీళ్లు కవలలా ? మళ్ళీ నన్ను మోసపుచ్చటానికి చూస్తు న్నావల్లే వుందే! వీళ్ళు కవలలే అయి నట్టయితే, నాకా చిక్కకుండా పోవటం!'' అన్నాడు.

అప్పుడు గడ్డపువాడు, '' నిజమే. నీవు కావాలనే వీళ్ళను వదిలేశావు.'' అంటూ కవలసోదరుల దృష్టి లోపాలను గురించీ, దానిని తను సరిచేయటాన్ని గురించీ అంతా తెలియజేశాడు గత్యంతరంలేక.

అంతా విని రాక్షసుడు, '' బలికి కావలసిన యాభై మంది కవలలూ సమ కూరినట్టే కదా ? నువ్వు చెప్పినదంతా నిజమేనని నమ్మవలసిందేనా? వీళ్ళు కవలలు అవునో కాదో ఎలా ఋఢి అవు తుంది ? వాళ్ళనే అడుగుతా.'' అని చెప్పి, సంధ్యా నిశీధుల వైపు తిరిగి, '' మా వాడు చెప్పిందంతా నిజమేనా ? నిజం కప్పిపుచ్చినా, మీ ప్రాణాలు దక్కవు. కనుక, అబద్ధమాడకండి. నిజంగా మీరు కవలలే అయినట్టయితే, ఒక మహత్తరమైన కార్యం కోసం ప్రాణా లర్పించామనే తృప్తిఅయినా వుంటుంది మీకు,'' అన్నాడు.

ఇందుకు సంధ్యానిశీధులు, "నిజమే!" అన్నారు కన్నీరు కార్చుతూ.

దాపులనే పొంచివున్న ఉదయనుడు నిశ్చేష్టుడైపోయాడు. నమ్మి గడ్డపువాణ్ణి ప్రాణాలతో వదిలినందుకు, యిదా ఫలితం అనిపించిందతడికి. వాడిని, అప్పటికప్పుడే నరికి పారేద్దామా అనుకున్నాడు. కాని, అంతలోనే రాక్షసుడి గొంతు వినిపించింది.

"అయితే, ఆ మూడో వాడెక్కడ?" అని రాక్షసుడు, గడ్డపువాణ్ణి ప్రశ్నించాడు.

అందుకు గడ్డపువాడు, "వాడు ఇంటికి పోయి వస్తానని చెప్పి వెళ్ళి, ఇప్పటికి వారం రోజులైంది. ఈపాటికి తిరిగి రావలసిందే. దారిలో ఏదైనా ప్రమాదము సంభవించిందో యేమో! ఇంతలో వస్తాడన్న నమ్మకం లేదు." అన్నాడు.

"సరే, ఆలస్యం ఎందుకు? రేపే బలి పూర్తిచేసి, దేవిని ప్రసన్నం చేసేసుకుంటాను. ఏర్పాట్లన్నీ చేయాలి. నిన్ను నమ్మి వదులుతానని మాత్రం అనుకోకు." అంటూ రాక్షసుడు, గడ్డపువాడినీ, సంధ్యానిశీధులనూ, రాజభటులనూ ఒక్కొక్కళ్ళను, ఒక్కొక్క చెట్టుకు అంటగట్టి, పెద్ద పెట్టున నవ్వుతూ గద్ద రూపంలో ఆకాశ మార్గాన ఎగిరిపోయాడు.

రాక్షసుడు వెళ్ళి వెళ్ళటంతోనే, ఉదయనుడు కత్తి దూసి, ఒక్క పరుగున గడ్డపువాడున్న చెట్టు వద్దకుపోయి వాడిని నరకబోయాడు.





"ఆగు, తొందరపడకు! నేను చెప్పేది సాంతం విని, ఆపైన నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి," అన్నాడు గడ్డపువాడు.

"వినేదేమిటి? విన్నది చాలు. ప్రాణాలతో వదిలినందుకు బాగా చేశావు. నిన్నేం చేసినా పాపం లేదు. ఇంకా ఆగమంటావేమిటి?" అంటూ హుంకరించాడు ఉదయనుడు.

"అబ్బాయీ! నువ్వు యిలా అపోహపడటంలో ఆశ్చర్యం లేదులే. ఐనా చెప్పేది విను. ఈ క్షణానికి తప్పించుకొని బైటపడితే చాలుననే ఉద్దేశంతోనే, నేను వాడికి మీ జన్మ రహస్యం చెప్పవలసి వచ్చింది. తప్పించుకోటానికి మరో మార్గం లేదు. నా స్థానంలో నువ్వున్నా, మరేమీ చెయ్యలేవు. నా ఉపాయం పారింది. రేపటి వరకూ వాడు ఆగటం నిజంగా మన అదృష్టమే," అన్నాడు గడ్డపువాడు.

ఉదయనుడు ఆలోచనలో పడ్డాడు. అతడు కొంచం పస్తాయించి, "సరే, నిన్ను నమ్మామే అనుకో. తెల్లవారేలోగా వాడికి చిక్కకుండా మనమందరం తప్పించుకోవటం ఎలా?" అన్నాడు.

అప్పుడు గడ్డపువాడు, "అదీ ఆలోచించా, చెప్పుతా. ముందు వీళ్ల కట్లు కూడా విడిపించుదాం పద," అంటూ సంధ్యా నిశీధులనూ, రాజభటులనూ విడిపించాడు. తర్వాత వాళ్ళను వెంట బెట్టుకుని కొలను దగ్గిరకు వెళ్ళాడు. వాళ్ళను చూస్తూనే రాకుమార్తెలు ఒడ్డుకి వచ్చేశారు.

గడ్డపువాడు, ఉదయనుణ్ణి, "ఆ ఎర్ర అంజనం యిలాతే," అన్నాడు.

ఉదయనుడు అంజనం యివ్వగానే, వాడు రాకుమార్తెలను దగ్గరకు రమ్మని పిలిచాడు. వాళ్ళు వచ్చాక ఆ ఎర్ర అంజనం తీసి సుహాసిని భుజానికి రాశాడు. వెంటనే ఆమె చెయ్యి మాయమైంది. తరవాత సుభాషిణిని కూర్చోబెట్టి, మోకాలి దగ్గిర అంజనం రాచేసరికి

ఆమె కాలు మాయమైంది. మరి కాస్త అంజనం తీసి సుకేశిని కళ్ళకు రాచాడు. దానితో ఆమె కళ్ళు రెండూ పోయాయి. ఈ విధంగా రాకుమార్తెలు ముగ్గురికీ అంగ వైకల్యం కల్పించటం చూచి ఉదయనుడు, "ఏమిటీ దారుణం? ఏదో ఉపాయం చెబుతానని చెప్పి, ఇదా నువు చేసేపని?" అని ఉగ్రుడయాడు.

"ఎంతకూ నీ తొందరపాటు మాత్రం మానవుకదా! అన్నింటికీ అలా అనుమాన పడతావేమిటి?" అంటూ గడ్డపువాడు, ఉదయనుడి చెవిలో ఏదో చెప్పాడు.

ఉదయనుడు కొంత తృప్తిపడి, "మరి ఇంతకాలం ఏ విధమైన అవయవలోపం లేకుండావుండి, రేపు వాడు వచ్చి చూసే సరికల్లా యిలా జరిగితే వాడు, నీ పైన అనుమానపడడా? దీనివల్ల మనకు కలిసివచ్చేదేముంది?" అని అడిగాడు.

"అదంతా తర్వాత చూద్దాం. ప్రస్తుతం యింతకంటే మార్గంలేదు. రేపు రాక్షసుడు వచ్చేవేళకు, మేము ఎప్పటిలాగా చెట్లకు కట్టివెయ్యబడి వుంటాం. నీవు మాత్రం భస్మం చల్లుకుని అదృశ్యరూపంలో వుండి, ఏమి జరుగుతుందో కనిపెడుతూ వుండు," అన్నాడు గడ్డపువాడు.

ఉదయనుడు తెల్లబోయాడు. "ఆ భస్మమేవుంటే యిన్ని పాట్లెందుకు



పడాలి? శ్రావస్తీనగరం నుంచి తిరిగి వచ్చేప్పుడు, అది కాస్తా పోగొట్టుకొన్నాను," అన్నాడతడు.

"ఏమిటీ పోగొట్టుకున్నావా? ఫరవా లేదులే. నీవు మాకు యిచ్చివెళ్ళిన భస్మం మేము వాడలేదు. ఇదుగో!" అంటూ గడ్డపువాడు పొట్లం తీసి యిచ్చాడు.

ఆ తర్వాత ఉదయనుడు వాళ్ళను, మళ్ళీ ఎప్పటిలాగా చెట్లకు కట్టివేసి, తను అదృశ్య రూపంలో వుండిపోయాడు.

* * *

మరసటి రోజున తెల్లవారే సమయంలో సుడిగాలి ప్రారంభమైంది. రాక్షసుడు వస్తున్నాడు కదా అనుకున్నారు అందరూ.



సంధ్యా నిశీధులూ, గద్దపువాడూ, రాజభటులూ ఎంతో అలసిపోయిన వాళ్ళలా చెట్లకు చేరగిలబడి వున్నారు. మరి కొద్దిసేపటికల్లా రాక్షసుడు రానే వచ్చాడు. అతని వెంట గండ్రగొడ్డళ్ళు భుజాన వేసుకున్న యిద్దరు భటులు వస్తున్నారు. ఆ వెనక ఎంతో మంది పరివారం పూలదండలతో నడిచివస్తున్నారు.

రాక్షసుడు, సంధ్యా నిశీధులున్న చోటుకు చేరుకుంటూనే, తనకు ఏర్పరచిన సింహాసనంపై అధిష్ఠించాడు. తరవాత తన పరివారాన్ని, "కొలనులో కవల లందరకూ స్నానాలు చేయించి, దివ్యంగా అలంకరించి, ఒక్కొక్కళ్ళనే తెచ్చి, నా ఎదట నిలబెట్టండి," అని ఆజ్ఞాపించాడు.

వెంటనే ఎవరి పనులలో వారు నిమగ్నమైపోయారు. ఒకరు స్నానాలు చేయిస్తున్నారు, మరొకరు వస్త్రాలు అలంకరిస్తున్నారు. అలంకరణ పూర్తి అయినవారినల్లా రాక్షసుడి ఎదట నిలబెడుతున్నారు. రాక్షసుడు బ్రహ్మానంద భరితుడవుతున్నాడు. తన ఎదటతెచ్చి నిలబెడుతున్న రాజకుమార్తెలనూ, రాకుమారులనూ చూస్తూ, "నీవు కనకపురి రాజకుమార్తెవు కదూ? నీవు అవంతీశుని అందాల భరిణెవుకదూ? నీవు మణిపుర రాకుమారుడివి కదా?" అంటూ పేరుపేరున పరామర్శిస్తున్నాడు. పాపం, వాళ్ళు తలలు వంచుకుని కన్నీరు, మున్నీరుగా విలపిస్తున్నారు.

ఇంతలో . ఒక పరిచారిక మరొక రాకుమార్తెను తీసుకువచ్చి, నిలబెట్టి, "ఇదేమిటి, ప్రభూ? ఈ గుడ్డిదాన్ని తెచ్చారే, దేవి యీ పిల్లను స్వీకరిస్తుందా?" అన్నది.

రాక్షసుడు నివ్వెరపోయి, "ఏమిటీ, గుడ్డిదా?" అంటూ సింహాసనం దిగి, ఆ రాకుమార్తెను పరిశీలించబోయేంతలో, మరో పరిచారిక, "ఈ కుంటిదాన్ని తెచ్చారేమిటి, ప్రభూ?" అంటూ తను

తెచ్చిన రాకుమార్తెను, రాక్షసుడి ఎదట వుంచింది.

రాక్షసుడు కోపం పట్టలేక పోయాడు. కళ్ళవెంట నిప్పులు గక్కుతూ, "మోసం! ద్రోహం!!" అని భూమ్యాకాశాలు దద్దరిల్లేటట్టు అరిచాడు.

ఇంతలో మరో పరిచారిక, "ఈ రాకుమార్తెకు కళ్ళే లేవు, మా రాజా!" అంటూ తన వెంట తెచ్చిన రాకుమార్తెను, రాక్షసుడికి చూపించింది.

రాక్షసుడి కోపం మిన్నుముట్టింది. ఒక్క ఉరుకున గడ్డపువాడి దగ్గరకు వెళ్ళి, వాణ్ణి చెట్టుతోసహా పెళ్ళగించి, "ఏమిటీ ద్రోహం? లక్షణమైన కవలలను తెచ్చి కొలనులో వేశానే. ఇప్పుడీ కురూపులెక్కడనుంచి వచ్చారు? ఇది నీ పనే. ఉన్నది వున్నట్టు చెప్పుతావా, లేక ముందే నిన్నిక్కడ బలి యిచ్చేయమంటావా?" అని గద్దించాడు.

గడ్డపువాడు తొణకకుండా, "కేకల వల్ల ప్రయోజనం లేదు. ఈ పని నేను చేశానని కదూ, నీ అనుమానం? ఒక్క క్షణం ఆగి, చెప్పేదంతా విను. ఆపైన నీ యిష్టం వచ్చినట్టు చెయ్యి." అన్నాడు కరుకుగా.

"చాల్లే. ఏర్పాట్లన్నీ సిద్ధం చేసుకువస్తే, అవన్నీ మంట గలిపావు. కాలయాపన చెయ్యకుండా అదేదో త్వరగా అఘోరించు." అన్నాడు రాక్షసుడు చెట్టును అమాంతం కిందపడవేస్తూ.



"వాళ్ళకు యీ అంగవైకల్యం ఎలా ఏర్పడిందో నాకూ తెలియదు. ఐతే, ఒకలా జరిగి వుండొచ్చని నాకు తోస్తున్నది. ఇలా చేయగల ప్రజ్ఞ తప్పించుకు పోయిన, ఆ ఉదయనుడికే వున్నది. కవలలకు నేను దృష్టిలోపం పోగొట్టినప్పుడు, ఈ రహస్యం కాస్తా చెప్పి వేశాను. అందుకు కావలసిన అంజనాలూ అవీ కూడా, వాడి వద్దనేవుండి పోయినై. వాడు బ్రతికేవుంటే, ఎప్పుడో ఒకప్పుడు నీకు చిక్కకపోడు. అప్పుడు వాడిచేతనే, వీళ్ళకు మళ్ళీ యీ అంగవైకల్యం పోగొట్టించవచ్చు. అప్పటి వరకూ యీ కుర్రవాళ్ళను బంధించి వుంచు. ఇదే నేను చెప్పగల సలహా. తరవాత నీ యిష్టం,'' అన్నాడు గడ్డపువాడు.

''సరే, కానివ్వు. ఈసారి వాడు చిక్కాడా, చచ్చాడన్నమాటే! ముందు మీ సంగతి చూడాలి, పదండి!'' అంటూ రాక్షసుడు, సంధ్యా నిశీధులనూ, రాజ భటులనూ, గడ్డపువాడినీ ఒక తాడుతో బంధించి, కోపంతో రుసరుసలాడుతూ తన వెంట లాక్కుపోయాడు.

ఇదంతా చూస్తూ ఉదయనుడు, రాక్షసుణ్ణి వెంబడిస్తూనేవున్నాడు. కొద్ది దూరం పోయి రాక్షసుడు ఒక ఆకుల గుట్ట దగ్గిర ఆగాడు. గద్దరూపం పొంది, విశాలమైన తన రెక్కలను విసురుగా ఆడించేసరికి, ఆ ఆకులన్నీ చెల్లా చెదరై పోయి, ఆ చోట భూమిలోకి ఒక ద్వారం ఏర్పడింది. రాక్షసుడు, సంధ్యా నిశీధులనూ, గడ్డపువాడినీ, భటులనూ ఆ ద్వారంగుండా లోపలికి తోశాడు. వెంటనే మళ్ళీ ఆకులు కూడదీసి ద్వారం మూసివేసి, కొలను వద్దకు వచ్చాడు.

అలంకరణ పూర్తి అయిన కవలలను, జాగ్రత్తగా చూస్తూ వుండమని, అక్కడి పరిచారకులనూ, భటులనూ హెచ్చరించాడు. అంగవైకల్యం ఏర్పడిన సుహాసినీ, సుభాషిణీ, సుకేశినీలను ఎత్తుకొని గద్ద రూపంలో ఎగిరిపోయాడు.

—(ఇంకా వుంది)





# ఉత్తమదానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు పడే ఈ శ్రమ వల్ల నీకు ఎంత పుణ్యం లభిస్తుందో ఎవరూ చెప్పలేరు. పుణ్యకార్యాలలో ఏది ఎక్కువో, ఏది తక్కువో, నిర్ణయించటం ఎవరికీ సాధ్యం కాదు. ఇందుకు నిదర్శనంగా నీ కొక చిన్నకథ చెబుతాను, శ్రమతెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం ఒక దేశంలోని ఒక గ్రామంలో శ్రీపతి అనే వైశ్యుడూ; రామనాధు డనే వ్యవసాయకుడూ ఉండేవాళ్లు. ఇద్దరూ సంపన్నులే, సజ్జనులే. శ్రీపతి ప్రత్యేకించి దానధర్మాలు చెయ్యటంలో పేరు మోసినవాడు.

## బేతాళ కథలు



ఒకనాడు శ్రీపతి వుండే వీధి వెంట ఒక యువకుడు పోతూ, ఎండ తీవ్రతకూ, ఆకలి బాధకూ తట్టుకోలేక మూర్ఛపోయాడు. శ్రీపతి పరిగెత్తుకుంటూ వెళ్ళి, ఆ యువకుణ్ణి నీడకు చేర్చి, ముఖం మీద నీళ్ళుచల్లి, కోలుకొనేటట్టు చేసి, అతడి సంగతి తెలుసుకున్నాడు.

ఆ యువకుడు ఒక యాచకుడు; రెండు, మూడు రోజులుగా తిండిలేని కారణం చేత మూర్ఛపోయాడు. శ్రీపతి ఆ యువకుడికి కడుపు నిండా తిండిపెట్టి, పడుకునేటందుకు ఒక చాప ఇచ్చాడు. ఆ యువకుడు ఆ రాత్రి కూడా శ్రీపతి ఇంటనే భోజనం చేసి, ఆ రాత్రి పడుకుని, మర్నాడు ఉదయం ఆయన వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

అయితే ఆ యువకుడు పగలంతా తిరిగినా ఎక్కడా భోజనం దొరకలేదు. చేసేదేమీ లేక ఆ రాత్రి మళ్ళీ అతను శ్రీపతి ఇంటికే వచ్చి, భోజనం చేసి, పడుకున్నాడు.

రామనాధుడు శ్రీపతిని కలుసుకుని, "రెండు రోజులుగా మీ ఇంట భోజనంచేసి పడుకుంటున్న యువకుడు ఎవరు?" అని అడిగాడు. శ్రీపతి చెప్పాడు. మూడోనాడు తెల్లవారగానే రామనాధుడు ఆ యువకుణ్ణి కలుసుకుని, "అబ్బాయీ, నువు చూడబోతే యువకుడివి. నీలో అంగవైకల్యం ఏమీలేదు. అలాటప్పుడు ఏదైనా పని చేసుకుని బతకకుండా, ఇలా ఎందుకు యాచనకు దిగావు?" అని అడిగాడు.

దానికి ఆ యువకుడు, "అయ్యా, నా తల్లిదండ్రులకు నేను ఒక్కణ్ణే కావటం చేత నన్ను చాలా గారాబంగా పెంచారు. నాకు ఏ విద్యా రాలేదు. నిన్న మొన్నటి దాకా నా తల్లిదండ్రుల నీడనే పెరిగాను. వాళ్ళు పోగానే, ఏ పనీ చేతగాని నేను యాచనతో బతకవలసి వచ్చింది," అన్నాడు.

రామనాధుడు బాగాఆలోచించి, "అబ్బీ, నువు ఇలా యాచన చేసే పని లేదు.

ఎక్కువ శ్రమ కూడా పడనవసరంలేదు. నీలాటి వాళ్ళు నా దగ్గిర చాలామంది పని చేస్తున్నారు. నాకు పెద్ద అవుల మంద ఉన్నది. నీకు పిడకలు చేసి, అమ్మటం నేర్పుతాను," అని చెప్పి, తన వెంట పశువుల దొడ్డికి తీసుకు పోయాడు. అక్కడ అయన ఆ యువ కుడికి పిడకలు ఎలాచెయ్యాలో చూపాడు; ఎండిన పిడకలను ఆ యువకుడి చేత నగరానికి పట్టించుకుపోయి, అక్కడ వాటిని ఎలా అమ్మాలో నేర్పాడు.

ఆ యువకుడికి ఈ చిన్న విద్య త్వరలోనే అలవడింది. వాడు రోజూ పిడ కలుచేస్తూ, వాటిని నగరంలో అమ్ముతూ, వచ్చిన డబ్బులో సగం రామనాధుడికి ఇస్తూ మిగిలిన దానితో సుఖంగా జీవిం చటం నేర్చుకున్నాడు.

ఇలా ఉండగా ఆ దేశంలో వర్షాలు కురవక కరువు ఏర్పడింది. ఆ దేశపు రాజు పండితులనూ, దైవజ్ఞులనూ పిలిచి, ఏం చెయ్యాలని అడగగా, దాన ధర్మాలు చేసి ఉత్తమమైన పుణ్యం సంపాదించిన వాడు తన పుణ్యాన్ని సగం ధారపోస్తే వర్షాలు కురిసి, కరువు తొలగిపోతుందని చెప్పారు.

కాని, దానాలలో ఏది ఉత్తమమో ఎవరూ చెప్పలేకపోయారు. అందుచేత రాజు, తన దేశంలో దానాలు చేసిన ప్రతి వాళ్ళూ వచ్చి తమ పుణ్యంలో సగం దానం చెయ్యవలసిందిగా చాటింపు



వేయించాడు. ఆ ప్రకారమే అనేక మంది రాజుండే కోటకు వచ్చి, అక్కడ జరిగే పుణ్యదానయజ్ఞంలో తమ పుణ్యంలో సగం శాస్త్రోక్తంగా దానం చేస్తూ వచ్చారు. కాని అందువల్ల కొంచెం కూడా ప్రయోజనం కనబడలేదు. పరిస్థితిలో ఎట్టి మార్పూ లేదు.

అయినా రాజు విసుగు చెందక యజ్ఞం అలాగే కొనసాగించాడు. ఈ యజ్ఞం వార్త తమకు తెలిసేసరికి చాలాకాలం పట్టడం చేత, దూరాన ఉన్న తమ గ్రామం నుంచి శ్రీపతీ, రామనాధుడూ కూడా రాజాజ్ఞ ప్రకారం వచ్చారు. శ్రీపతి ముందు తన పుణ్యంలో సగం దేశానికి దానం చేశాడు. తరవాత రామనాధుడు తన పుణ్యంలో సగం దానం చేశాడు. వెంటనే ఆకాశాన మేఘాలు కమ్మి భారీగా వర్షాలు పడ్డాయి. త్వరలోనే కరువు తీరిపోయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, తన జీవితమంతా దానధర్మాలలో గడిపి, మహా దాతగా పేరు మోసిన శ్రీపతి సంపాదించిన పుణ్యంకన్న రామనాధుడి పుణ్యం ఎలా ఎక్కువ అయింది? అన్నదానం కన్న ఎక్కువైన దానం ఏమున్నది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శ్రీపతి అన్నదానం చేసి ఏ పూట కాపూట ఆకలి బాధ నివారణ చేశాడు. కాని రామనాధుడు అనేక మందికి బతుకు తెరువు చూపి, జీవితాంతమూ వారికి ఆకలి సమస్య లేకుండా చేశాడు. వారి నిస్సహాయతను తొలగించాడు. అందుచేత రామనాధుడి పుణ్యం నిశ్చయంగా ఎక్కువైనది. దానాలన్నిటిలోకీ విద్యాదానం ఉత్తమోత్తమ మనటానికి సందేహం లేదు." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# కనువిప్పు

రామాపురం అనే గ్రామంలో బాపన్న అనే ఒక ధనికుడు ఉండేవాడు. అవసరానికి మించిన ఐశ్వర్యమూ, అనుకూలవతి అయిన భార్యా ఉండటాన ఆయన జీవితం చాలా కాలంపాటు ఆనందంగా గడిచింది. లేకలేక కొడుకు పుట్టి, వాడు పెరగటం ఆరంభమయే సరికి ఆయనకు పెద్ద సమస్య ఎదురయింది.

బాపన్న కొడుకు నారాయణ చిన్నతనం నుంచీకూడా పెంకెఘటం. చిన్న పిల్లవాడు గదా అని బాపన్న వాడి విషయం కొంత కాలంపాటు ఉపేక్షచేస్తూ వచ్చాడు. కాని వయసువస్తున్న కొద్దీ నారాయణ కొరకరాని కొయ్య అయిపోయాడు. ఎవరిమాటా వాడికి లక్ష్యం లేదు. పదేళ్ళు వచ్చాయి గాని వాడికింకా ఓ నా మా లైనా రావు. వాడి ధ్యాస ఆటల పైనుంచి చదువు మీదికి మళ్ళించటానికి బాపన్న ఎన్నో ప్రయత్నాలు చేశాడు, కాని లాభం లేకపోయింది. ఒక్కగానొక్క కొడుకు! వాణ్ణి ఆయన ఏమీ అనలేడు. వాడి భవిష్యత్తు గురించిన ఆలోచనలతో ఆయనకు తీరని బెంగ పట్టుకున్నది.

ఇలా ఉండగా, బాపన్న ఇంటికి సమస్త శాస్త్రాలూ, సకల విద్యలూ తెలిసిన విద్యానాధుడు అనే మహానుభావుడు వచ్చాడు. ఒకప్పుడు బాపన్న ఆయన వద్ద విద్యాభ్యాసం చేశాడు. తన పూర్వ విద్యార్థిని చూసి పోదామని ఆయన ఇప్పుడు వచ్చాడు. ఆయనతో బాపన్న తన కొడుకు గొడవ చెప్పుకున్నాడు.

విద్యానాధుడు నవ్వి, "చిన్నతనంలో మితిమీరిన గారాబంచెయ్యటంచేత పిల్లలు ఇలాగే చెడిపోతారు. నేనిక్కడ ఒక వారం రోజులుండి, మీ అబ్బాయిని దారిలో పెట్టగలనేమో చూస్తాను," అన్నాడు.

"వసుంధర"



ఆ రోజు సాయంత్రం ఆయన నారాయణతో కాసేపు మాట్లాడాడు. వాడికి కొత్తవాళ్ళంటే బెరుకులేదు; పెద్ద వాళ్ళంటే గౌరవంలేదు. తనకు ఆటలంటే ఇష్టమని నారాయణ ఆయనకు చెప్పాడు.

"నువు ఎలాంటి ఆటలు ఆడతావో నాకు చూడాలని ఉన్నది. నీ ఆటలు బాగుంటే నేనుకూడా ఆడతాను. చదువుకోమని ఇక మీ నాన్న నిన్ను వేధించకుండా చూస్తాను," అన్నాడు విద్యానాధుడు.

ఈ మాటతో నారాయణకు ఉత్సాహం కలిగింది. వాడు ఆయనతో, "నేను ఇంట్లో ఆడేవి ఆటలేకావు. నా అసలు ఆటలు చూడాలంటే ఊరి బయట కొండ మీదికి రావాలి," అన్నాడు.

విద్యానాధుడు, "అలాగే పోదాం, పద," అన్నాడు.

ఇద్దరూ కలిసి ఊరి చివర కొండకు పోతూంటే, దారిలో తగిలిని అనేకమంది గ్రామస్థులు విద్యానాధుడికి పడీ, పడీ దణ్ణాలు పెట్టారు. అదిచూసి నారాయణ చాలా ఆశ్చర్యపడి, వాళ్ళు అలా దణ్ణాలు పెట్టటానికి కారణమేమిటని విద్యానాధుణ్ణి అడిగాడు.

"అది తరవాత చెబుతాను. ముందు నీ ఆటలు చూడనీ!" అన్నాడు విద్యానాధుడు.

కొండ దగ్గిర చాలామంది పిల్లలు రకరకాల ఆటలు ఆడుకుంటున్నారు. నారాయణను చూడగానే ఎంతో ఉత్సాహంతో కేకలు వేస్తూ ముందుకు రాబోయిన పిల్లలు, వాడి పక్కన విద్యానాధుణ్ణి చూసి వెనక్కు తగ్గారు.

"ఫరవాలేదు! ఈయన మన ఆటలు చూస్తాట్ట! రండి, మనం ఆడుకుందాం," అని నారాయణ వాళ్ళకు ప్రోత్సాహం ఇచ్చాడు.

తర్వాత పిల్లలంతా కలిసి ఏవేవో ఆటలు ఆడుకున్నారు. లోపల చిరాకు

అనిపించినా, విద్యానాధుడు అవన్నీ ఓపికగా చూశాడు.

కొంతసేపు గడిచాక ఆయన నారాయణను పిలిచి, "ఇందాక చాలామంది నాకు నమస్కారాలు చెయ్యడం గురించి అడిగావు. నీకుకూడా అలా గౌరవం పొందటం ఇష్టమేనా?" అని అడిగాడు.

"ఇష్టమే. కాని అందుకు ఏం చెయ్యాలి?" అని నారాయణ ఎదురు అడిగాడు.

"బహుశా ఈ ఆటలు మానవలసి ఉంటుంది. నువు ఆ పని చేసేటట్టుంటే, నిన్ను అందరూ గౌరవించేలాగా నేను చెయ్యగలను. ఏమంటావు?" అన్నాడు విద్యానాధుడు.

"నేను ఆటలు మానేస్తానే అనుకుందాం. మీరు నాకు గౌరవం కలిగేటట్టు చెయ్యగలరని ఏమిటి?" అని నారాయణ నిర్లక్ష్యంగా అడిగాడు.

"ఈ ప్రపంచంలో నాకు అసాధ్యమంటూ లేదు. నేను తలుచుకున్నానంటే, ఎవరికైనా, దేనికైనా గౌరవం లభించి తీరుతుంది!" అన్నాడు విద్యానాధుడు, గర్వం ముఖం పెట్టి.

నారాయణ వెటకారంగా నవ్వుతూ, అటూ ఇటూ చూసి, కొంచెం దూరంలో నేలమీద పడి ఉన్న నల్ల రాతిని కాలితో విద్యానాధుడి కేసి తోస్తూ, "చెప్పండి, ఈ రాయికి కూడా గౌరవం కలిగిస్తారా?" అని అడిగాడు.



విద్యానాధుడు తొణకకుండా, "ఈ రాయికి ఎలాటి ప్రతిష్ఠ కలిగిస్తానో రేపు నువే చూస్తావు," అని రాయి తీసుకుని, అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

"ఎవరో పిచ్చివాడిలా ఉన్నాడు," అని పిల్లలందరూ నవ్వుకున్నారు.

నారాయణ మటుకు, విద్యానాధుడు రాయి తీసుకుపోవడం చూసి, కాస్త ఆశ్చర్యపడ్డాడు.

మర్నాడు నారాయణ నిద్రలేచేసరికి, ఇంటి నడవలో చాలా హడావుడిగా వున్నది. అదేమిటో తెలుసుకుందామని వాడు అక్కడికి వెళ్ళేసరికి, ఒక బల్ల మీద జీవకళ ఉట్టిపడే కృష్ణవిగ్రహం ఉన్నది. జనం ఒక్కొక్కరేవచ్చి, దానికి నమస్కారం చేసి పోతున్నారు. విద్యానాధుడు అక్కడే నిలబడి ఉండి, నారాయణను చూడగానే, బయటికి రమ్మని సైగ చేశాడు.

"నిన్న నువు కాలితో తన్నిన రాయినే ఆ విగ్రహంగా మలిచాను. అందరూ దానికి నమస్కారాలు చేస్తున్నారు. ఇప్పటికైనా నా శక్తిలో నీకు నమ్మకం కలిగిందా?" అని ఆయన నారాయణను అడిగాడు.

నారాయణ ముఖం చిట్లించి, "రాయి కాబట్టి మీరు చెప్పినట్టు విని, మీకు లొంగింది. నేనంత సులభంగా మీకు లొంగను. పదిమందీ నన్ను గౌరవించేటట్టు చెయ్యడం మీ వల్ల కాదు," అన్నాడు.

విద్యానాధుడు వెటకారంగా నవ్వి, "వెర్రివాడా! నిన్ను అందరూ గౌరవించేలా చెయ్యలేకపోతే అందువల్ల నాకు వచ్చే అవమానమేమీ లేదు. నీ కన్న ఆ రాయే నయమని పది మందీ నిన్ను గురించే అనుకుంటారు. ఆ మాట గుర్తుంచుకో," అన్నాడు.

ఆ మాటతో నారాయణకు కనువిప్పు కలిగింది. ఆ తరవాత వాడు తండ్రితో చెప్పి, విద్యానాధుడి వెంట విద్యాభ్యాసానికి వెళ్ళిపోయాడు.



# పిశాచాల పెళ్ళికొడుకు

ఒక ఊళ్ళో దక్షిణాన వల్లకాట్లో, పురాతనమైన చింతచెట్టు మీద కొన్ని ఆడ పిశాచాలు నివాసం ఏర్పాటు చేసుకుని ఉంటున్నాయి. వాటిలో ఒక కుర్రపిశాచి సంసార జీవితం అనుభవించకుండానే పిశాచి అయిపోయింది. అందుచేత దానికి మళ్ళీ మనిషిగా మారి, పెళ్ళి చేసుకుని, సంసార జీవితం గడపాలనే కోరిక గాఢంగా ఉంటూ వచ్చింది.

ఒకరోజు కుర్రపిశాచి తన కోరికను మిగతా పిశాచాలకు చెప్పింది. ఆ మాట విని పిశాచాలు విరగబడి నవ్వి, "మళ్ళీ వెళ్ళి ఆ సంసార కూపంలో పడతావా? నీకేమైనా బుద్ధివున్నదా? సుఖాన ఉన్న ప్రాణాన్ని దుఃఖంలో ముంచటం దేనికి?'' అన్నాయి.

''అత్తగారి బాధలూ, ఆడబడుచుల సాధింపులూ భరించలేకే నేను ఉరి పోసుకున్నాను. ఆ సంగతి నీకు తెలియదేమో!'' అన్నదొక పిశాచి.

''ఆడబడుచులూ, అత్తగారూ లేని ఇల్లే చూసుకుంటాలే!'' అన్నది కుర్ర పిశాచి.

మర్నాడు చీకట్లు ముసురుతూండగా కుర్రపిశాచి అందమైన అమ్మాయిగా మారి, కొంతదూరాన ఉన్న ఒక పాడుబడిన సత్రం అరుగు మీద ఏడుస్తూ కూర్చున్నది.

కాస్సేపటికి, అటుగా వెళుతూన్న ఒక అందమైన యువకుడు దాని కంట పడ్డాడు. వాణ్ణి చూస్తూనే కుర్రపిశాచి సంతోషపడిపోయి, మరింత గట్టిగా ఏడవ సాగింది.

''ఎవరు వారు? చీకటి పడినా ఇంకా ఇక్కడే ఉన్నావేం?'' అని ఆ యువకుడు అడిగాడు.

ఎం. కామేశ్వరరావు



కుర్రపిశాచి వెక్కి, వెక్కి ఏడుస్తూ, "మాది పారుగూరు. అమ్మా, నాన్నా పోయి అనాధనయాను. అలా ఊళ్ళు పట్టుకు తిరుగుతున్నాను. నా జీవితం ఎలా గడుస్తుందో?" అన్నది.

ఆ యువకుడు జాలిపడి, "ఎవరినైనా పెళ్ళి చేసుకోలేక పోయావా?" అన్నాడు.

"చెప్పటం తేలికే! కట్నం ఇయ్యలేని నన్ను ఎవరు పెళ్ళాడతారు?" అన్నది కుర్రపిశాచి.

"నీకు అభ్యంతరం లేకపోతే నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను," అన్నాడు యువకుడు.

"నాకు అత్తా, ఆడబడుచులూ ఉండటం అభ్యంతరమే," అన్నది కుర్రపిశాచి.

"నాకెవరూ లేరు. ఒంటరిగాణ్ణి. లంకంత ఇల్లు మాత్రం ఉన్నది," అన్నాడు యువకుడు.

"అయితే మన ఇంటికి పోదాం పద!" అంటూ కుర్రపిశాచి లేచి నిలబడింది.

ఆ యువకుడి ఇల్లు ఊరి మొదట్లోనే ఉన్నది. మర్నాడే ఇద్దరూ పెళ్ళి చేసుకుని ఆ ఇంట్లో కాపరం పెట్టారు.

అర్ధరాత్రి వేళ, తన భర్త నిద్రపోయాక, కుర్రపిశాచి ఇంట్లోంచి బయలుదేరి, తన పూర్వ నివాసమైన చింతచెట్టు దగ్గిరికి వచ్చింది.

"ఎవరా వచ్చింది? ఎంత ధైర్యం! చీల్చండి! చంపండి!" అని పిశాచాలు హంగామా చేశాయి.

కుర్రపిశాచి, వాటి హడావిడిచూసి, కాసేపు విరగబడి నవ్వి, తన అసలు రూపం ధరించింది.

"అరె, నువేనా? పోల్చుకోలేకపోయాం సుమా? నువు వెళ్ళిన పని సానుకూలమయిందా?" అని పిశాచాలు ఆత్రంగా అడిగాయి.

"అందమైన యువకుడే దొరికాడు. అత్తా, ఆడబడుచులూ లేరు. పాతకాలపు

పెద్ద ఇల్లు!" అని కుర్రపిశాచి గొప్పలు చెప్పుకున్నది.

"నీ మొగుడు ఎలాటివాడు? కాపరం ఎలా ఉన్నది?" అన్నది ఒక ఆడపిశాచి.

"నా మొగుడికేం? మాణిక్యం లాంటి వాడు. నేనంటే ప్రాణం అద్దు పెడతాడు. మా కాపరం నిక్షేపంలా ఉన్నది. మా మధ్య ఎటువంటి అభిప్రాయ భేదాలూ లేవు. ఇక నేను వెళతాను. ఆయన లేస్తే ఏమైనా అనుకుంటాడు. అసలే కొత్త కాపరం ఆయె!" అంటూ కుర్రపిశాచి వెళ్ళటానికి ఆదావుడి పడింది.

"వెళుదువు గానిలే! మాకు పెళ్ళి విందు పెట్టవేమిటి?" అని పిశాచాలు అమెను పట్టుకున్నాయి.

కుర్రపిశాచి కాస్సేపు ఆలోచించి, "అలాగే! విందు రేపు చేసుకుందాం. చీకటి పడ్డాక మీరంతా మనుషులుగా మారి మా ఇంటికి రండి. మిమ్మల్ని నా స్నేహితురాళ్ళుగా నా భర్తకు పరిచయం చేస్తాను. అర్ధరాత్రి నా భర్తకు తెలియకుండా మనం విందు చేసుకుందాం," అని చెప్పి, మళ్ళీ అమ్మాయిగా మారి ఇంటికి తిరిగి వచ్చింది.

మర్నాడు చీకటి పడ్డాక, పిశాచాలన్నీ అమ్మాయిలుగా మారివచ్చి, కుర్రపిశాచి ఇంటి తలుపు తట్టాయి.

కుర్రపిశాచి ఏమీ ఎరగనట్టు తలుపు తెరిచి, "అరె, అంతా ఒక్కసారే కట్ట కట్టుకుని వచ్చారే!" అని ఆశ్చర్యం



నటించి, వాళ్ళను తన స్నేహితురాళ్ళుగా తన భర్తకు పరిచయం చేసింది.

తరవాత ఆమె తన భర్తతో, "ఈ రాత్రికి మీరు కింద పడుకోండి. నేనూ, నా స్నేహితురాళ్లూ మేడమీద పడుకుంటాం," అన్నది.

అందరూ కలిసి మేడ మీదికి వెళ్లారు.

అర్ధరాత్రి కావస్తున్నది. భర్త మంచి నిద్రలో ఉన్నట్టు రూఢి చేసుకుని, కుర్ర పిశాచి చకచకా విందు ఏర్పాట్లు ప్రారంభించింది.

"ఈ మానవాకారాన్ని మోయటం మా వల్ల కాదు," అని పిశాచాలన్నీ తమ అసలు రూపాలు ధరించాయి.

విందు ఏర్పాట్లు పూర్తి అయాయి. పిశాచాలన్నీ జుట్టు విరబోసుకుని, చప్పట్లు చరుస్తూ, కోలాహలంగా నృత్యాలు చేశాయి. తరవాత అవి అన్నీ విందుకు కూర్చున్నాయి.

"మన గోలకి నీ మొగుడు లేచాడంటే కొంప మునుగుతుంది. ఎందుకైనా మంచిది ఒకసారి కిందికి వెళ్ళి చూసిరా!" అని ఒక ముసలిపిశాచి కుర్రపిశాచితో అన్నది.

కుర్రపిశాచి లేచి మేడ మెట్ల దాకా వెళ్ళి, ఆగిపోయి, కెవ్వున అరిచింది. కింది ఆవరణలో సుమారు ముప్పై మగ పిశాచాలు నృత్యం చేస్తున్నాయి. విందుకు అంతా సిద్ధంగా ఉన్నది.

తాను పెళ్ళాడినది తనలాటి ఒక కుర్ర మగ పిశాచాన్నేనని ఆమె గ్రహించింది. దానికి మండిపోయింది. అది ఆడపిశాచాలన్నిటినీ కూడగట్టుకుని, నృత్యాలు చేస్తున్న మగపిశాచాల మీద ఒక్కసారిగా పడింది.

పిశాచాలన్నీ అరుస్తూ, గీరుకుంటూ, రక్కుకుంటూ నానా భీభత్సం చేసి, పెళ్ళివిందు కుడవకుండానే, ఎవరి నివాసాలకు అవి వెళ్ళిపోయాయి.

ఈ అనుభవం తరవాత కుర్ర పిశాచి మళ్ళీ ఏనాడూ పెళ్ళి మాట తలపెట్ట లేదు.



# 164. నైల్‌నది ఆరంభదశ

ఏడువేల సంవత్సరాల క్రితం ఈజిప్టులో నాగరికతకు కారణభూతమైన నైల్‌నది విక్టోరియా సరస్సులో పుట్టి, కొండల మధ్యగా ప్రవహించి ఆల్బర్ట్ సరస్సులో పడుతుంది. ఆల్బర్ట్ సరస్సు ప్రాంతంలో జలపాతం బొమ్మలో మనకు కనిపిస్తుంది.





# కన్యాపూర్ సమస్య

కన్యాపూరు రాజైన సుపర్ణుడు తనకు సంతానంలేదన్న విచారంతో బాధపడ్డాడు. ఆయన వివాహం జరిగి ఇరవై ఏళ్ళయినా సంతానప్రాప్తి లేకపోయింది.

ఒకనాడు రాజభవనానికి ఒక ముని వచ్చి, విష్ణుమూర్తికి వాహనమైన గరుత్మంతుణ్ణి గురించి తపస్సు చేసినట్టయితే సంతానం కలుగుతుందని సుపర్ణుడికి సలహా ఇచ్చాడు.

సుపర్ణుడు ఆ ప్రకారమే కొండ మీదికి వెళ్ళి గరుత్మంతుణ్ణి గురించి తపస్సు చేశాడు. ఒక వారం గడిచినాక గరుత్మంతుడు రాజు ముందు ప్రత్యక్షమై, ''నాయనా, నీ భక్తికి మెచ్చాను. ఏం వరం కావాలో కోరుకో,'' అన్నాడు.

''స్వామీ, నాకు పిల్లలులేరు. సంతానం కలిగేటట్టు అనుగ్రహించు,'' అన్నాడు సుపర్ణుడు.

గరుత్మంతుడు అతనికి ఒక కాయ ఇచ్చి, ''దీన్ని నీ భార్య చేత తినిపించు. ఆమె గర్భవతి అయి, ఏమి ప్రసవించినా దాన్ని తాకకుండా, అలాగే ఉండనియ్యాలి,'' అన్నాడు.

ఆ కాయను తిన్న మీదట రాణికి గర్భచిహ్నాలు కనిపించాయి. పది మాసాల అనంతరం ఆమె ఒక గుడ్డును ప్రసవించింది! అది బాతుగుడ్డు లాగా పెద్దదిగా ఉన్నది. దాన్ని అలాగే నేల మీద ఉండనిచ్చారు. రోజు రోజుకూ అది పెరిగి పెద్దదవుతూ వచ్చింది:

అలా చాలా సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు సుపర్ణుడు చనిపోయాడు. అప్పటికి రాణి ప్రసవించిన గుడ్డు చాలా పెద్దది అయి ఉన్నది.

సుపర్ణుడు చనిపోయిన ఆరురోజులకు ఆ గుడ్డు అకస్మికంగా పగిలి, అందులో

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

నుంచి ఇద్దరు అందమైన యువకులు, రాజోచితమైన దుస్తులు ధరించి బయటికి వచ్చారు. ఒకడు నీలి దుస్తులు ధరించి, ఉన్నాడు. రెండోవాడు ఎర్రని దుస్తులు ధరించి ఉన్నాడు.

"మేం సుపర్ణరాజు కొడుకులం," అన్నారు వాళ్ళు.

"నా పేరు నీలకుమారుడు," అన్నాడు నీలి రంగు దుస్తులు ధరించినవాడు.

"నా పేరు రక్తకుమారుడు," అన్నాడు ఎర్ర దుస్తులు ధరించినవాడు.

మహామంత్రి రాణిని వెంటబెట్టుకుని వచ్చి, వాళ్ళకు స్వాగతం చెప్పాడు.

"మేమిద్దరమూ ఈ రాజ్యానికి వారసులం. రాజ్యాన్ని మాకు అప్పగించండి." అన్నారు యువకులు. ఇద్దరూ ఒకేసారి పుట్టిన వాళ్ళు కావటం చేత ఇద్దరికీ రాజ్యార్హత సమంగా ఉన్నది.

"ఉన్నది ఒకే రాజ్యం; ఒకే సింహాసనం. ఇద్దరూ ఏక కాలంలో యెలా రాజ్యం చేస్తారు?" అని మంత్రి వాళ్ళను అడిగాడు.

"రాజ్యాన్ని రెండు సమ భాగాలు చెయ్యండి. ఇద్దరమూ చెరొక భాగాన్నీ పరిపాలిస్తాం," అన్నారు కుమారులు.

"అసలే చిన్న రాజ్యం. దాన్ని విభజించటం ప్రజలకు సమ్మతం కాకపోవచ్చు," అన్నాడు మంత్రి.

"ప్రజల సమ్మతి ఎవరికి కావాలి? రాజులం కావాలన్నది మా కోరిక. అది





తీరవలసిందే. ఏమంటావు నీలకుమార్?'' అన్నాడు రక్తకుమారుడు.

అది నిజమేనన్నాడు నీలకుమారు.

అలా అయితే, ఏర్పాట్లు పూర్తి చెయ్యటానికి కొంత వ్యవధి ఇయ్యండి. కనీసం మూడు మాసాలన్నా లేనిదే అన్ని ఏర్పాట్లూ జరగవు,'' అన్నాడు మంత్రి.

''సరే, మూడు నెలలు తీసుకోండి. ప్రస్తుతం మాకు ఉండేందుకు వేరు వేరు భవనాలు ఏర్పాటు చెయ్యండి,'' అన్నారు కుమారులు.

మంత్రి వారిద్దరికీ రెండు మందిరాలు ఏర్పాటుచేసి, తన అనుచరులతో రాజ్యాన్ని విభజించటం గురించి ఆలోచించాడు.

''రాజ్యాన్ని ఏదో విధంగా విభజించ వచ్చు, పెద్ద కష్టమేంకాదు. కాని జీవన సరస్సును ఎలా విభజించటం?'' అన్నా డొక ఉపమంత్రి.

రాజ్యానికి ఉత్తర ప్రాంతంలో ఒక అందమైన సరస్సు తూర్పు పడమర లుగా విస్తరించి ఉన్నది. దాని నట్టనడిమి భాగంలో, ఉత్తర దక్షిణాలుగా, ఆనకట్ట కట్టినట్టుగా, రాళ్ల గుట్టలున్నాయి. అయితే వాటి మధ్యలో నూరు గజాల మేర తెరిపి ఉన్నది. ఈ తెరిపిని రాళ్ళతో పూడ్చి నట్టయితే జీవనసరస్సు రెండుగా విడి పోతుంది.

కాని అలా రెండు సరస్సులు చెయ్య టంలో ఒక గొప్ప ఉపద్రవం ఉన్నది. ఈ జీవనసరస్సు రెండు కొసలా, అట్టడు గున రెండు రకాల ఊటలున్నాయి. వాటి ద్వారా సరస్సులోకి ప్రవేశించే ఖనిజలవ ణాలు విషప్రాయమైనవి. అయితే ఇప్పు డుండిన పరిస్థితులలో నీరంతా ఏకలగా ఉండటం చేత ఆ విషలవణాలు ఒక దానికొకటి విరుగుడుగా ఉంటూ సరస్సు నీటిని ప్రజలకు ప్రాణాధారంగా ఉంచ గలుగుతున్నాయి. ఇప్పుడు ఆ సరస్సును రెండు సరస్సులుగా చేసేసినట్టయితే, రెండు భాగాల నీరూ విషపూరితమైపోయి, ప్రజలకు ప్రమాదం కలిగిస్తుంది. ఆ నీటి

వల్ల మనుష్యులే కాదు, జంతువులూ, చెట్లూ కూడా చచ్చిపోతాయి. చలి కాలంలో ఒక నెలపాటు సరస్సులో నీరు గడ్డకట్టుకు పోతుంది. అందుకని ప్రజలు ముందుగానే నీరు నిలవజేసుకుని, మంచు కరిగిన దాకా వాడుకునే వారు.

చలికాలం వచ్చేస్తున్నది. పెద్ద మంత్రి రాజకుమారుల వద్దకు వెళ్ళి, సరస్సును రెండుగా విభజించటంలో ఉండే ప్రమాదాన్ని తెలియజెప్పాడు. ఏమైనా సరే విభజన జరిగి తీరాలిసిందేనని వాళ్ళు పట్టుబట్టారు.

మరి రెండు రోజులు వ్యవధి అడిగి, మంత్రి తిరిగి వస్తూ మహారాణి దర్శనం చేసుకున్నాడు.

"నాకు ఇలాటి పిల్లలు కలుగుతారను కోలేదు, మంత్రిగారూ. దేశానికి వినాశం తెచ్చిపెట్టే బిడ్డలను కనే కన్నా, నేను గొడ్రాలుగా ఉంటే బాగుండేదేమో. వాళ్ళు చచ్చిపోవాలి!" అంటూ రాణి దుఃఖించసాగింది.

"మహారాణీ, మన ఆస్థాన ఇంద్రజాలికుడు శంకర్‌లాల్‌తో సంప్రతించి, ఎలాగైనా జీవనసరస్సును విభజించటం జరగకుండా చూస్తాను," అన్నాడు మంత్రి.

చలి ముదిరింది. సరస్సులో నీరు గడ్డ కట్టుకుపోయింది. ఈ లోపల తనను సంప్రతించ వచ్చిన మంత్రికి, శంకరలాల్ ఒక పరిష్కారమార్గం చెప్పాడు.



ఐంద్రజాలికుడు సలహా చెప్పిన ప్రకారం మంత్రి నీలకుమారుణ్ణీ, రక్త కుమారుణ్ణీ సరస్సు మీదికి తీసుకుపోయాడు. ఆయన గొడ్డలితో సరస్సు మధ్యభాగం నుంచి మంచు దిమ్మ ఒకటి నరికి, దాన్ని రాజభవనానికి తీసుకు వచ్చాడు. దాన్ని ఆయన రెండు బోర్లించిన లోటాల మీద ఉంచి, దాని చుట్టూ సన్నటి తీగ వలయం చుట్టి, దానికి ఒక పెద్ద బరువు వేళ్ళాడ గట్టాడు.

తరవాత ఆయన కుమారులతో, "చూడండి. కింద ఉండే బరువు మూలాన ఈ తీగ మంచు దిమ్మను రెండుగా కోసేస్తుంది. సరస్సు రెండుగా విభజన కావటం ఈశ్వర సంకల్పమైతే, మంచుదిమ్మ రెండు ముక్కలుగా తెగిపోతుంది. సరస్సు విభజన కావటం ఈశ్వరేచ్ఛ కాని పక్షంలో తీగ మంచు దిమ్మెను పైనుంచి కిందికి కోసేసినప్పటికీ, అది ఒకటిగానే ఉండిపోతుంది," అన్నాడు.

ఆయన మాట్లాడుతూండగానే తీగ మంచుదిమ్మను సగంలోతుకు కోసేసింది. మరి కొంతసేపటికి అది అడుగుదాకా మంచు దిమ్మను కోసేసి, కిందపడిపోయింది. కాని దిమ్మ ఎప్పటిలాగే ఉండిపోయింది.

"చూశారా, మహారాజుల్లారా! సరస్సు రెండు కావటం ఈశ్వరుడికి ఇష్టం లేదు," అన్నాడు మంత్రి.

"రాజ్యం విభజన కావటం కూడా ఈశ్వరుడికి ఇష్టం లేదు. మేం కేవలమూ మీ తెలివి పరీక్షించాం, అంతే! రాజ్యం ఏకంగానే ఉంటుంది. మేంకూడా ఏకమే అవుతాం, చూడండి," అంటూ రక్త కుమారుడు నీలకుమారుడిలో ఐక్యమైపోయాడు.

నీలకుమారుడు తన తల్లి వద్దకు వెళ్లి, ఎంతో భక్తితో ఆమె పాదాలకు ప్రణామం చేశాడు.

"నీలకుమారుడికీ, జై!" అని అందరూ నినాదాలు చేశారు.





ఆ నాడు రంజాన్ పండుగ. గోలకొండ నవాబు కొత్త బట్టలు ధరించి, చాలా సంతోషంగా, ఈద్‌గాకు దైవప్రార్థన చేసి రావటానికి వెళ్ళాడు.

చెన్నయ్య అనే సాలెవాడు తాను నేసిన జరీబూటీల రుమాలను ఆ సంవత్సరం నవాబుకు తెచ్చి యిచ్చాడు. మిలమిలా మెరిసి పోతున్న రుమాలను కప్పుకుని, అద్దంలో చూసుకుని నవాబు మురిసి పోయాడు. సపరివారంగా ఈద్‌గాకు వెళుతూ, రుమాలను దారిలో అందరూ మెచ్చుకోవటం ఆయన విన్నాడు. దైవ ప్రార్థన ముగించి, రాజభవనం చేరుతూనే నవాబు చెన్నయ్యను పిలిపించి, "రుమాల వెల ఎంత?" అని అడిగాడు.

"సర్కార్, రాత్రిం పగళ్ళు కష్టపడి, మీ కోసం రుమాల తయారుచేశాను. దాని ఖరీదు నేను నిర్ణయించటం మీ ఔదార్యాన్ని కొలవటం అవుతుంది. మీరిచ్చినది అనుభవిస్తూ ఎల్ల కాలం మిమ్మల్ని తలుచుకుంటూ ఉండేటట్టు మీరే నిర్ణయించండి," అన్నాడు చెన్నయ్య.

"నీ మనసులో మాట సూటిగా చెప్పు. మా ఖుషీ నీకే తెలుస్తుంది," అన్నాడు నవాబు, మీసాలు మెలివేస్తూ.

"నేను కుటుంబీకుణ్ణి! బీదవాణ్ణి! తిండికి చాలా కష్టపడుతున్నాను. నా రెక్కలకష్టంతో మా డొక్కలు నిండటం లేదు. భూమి దానమిప్పించండి, సర్కార్. పిల్లాజెల్లా బతుకుతాం," అన్నాడు చెన్నయ్య.

"అచ్ఛా! దివాన్జీ, ఇతని ఊళ్లోనే భూమిచూసి, దానపత్రాన్ని రాసి తీసుకు రండి," అంటూ హుకుం ఇచ్చాడు నవాబు.

దివాన్ పత్రాన్నే రాసి తెచ్చాడు. నవాబు దానిమీద సంతకం చేసి, చెన్నయ్యకు

వి. యజ్ఞరామయ్య

ఇస్తూ, '' దీన్ని గ్రామాధికారికి చూపించి, భూమి తీసుకో," అన్నాడు.

చెన్నయ్య తాను బయలుదేరిన వేళా విశేషానికి సంతోషించి, ఇక తన కష్టాలు గట్టెక్కుతాయనుకుంటూ, తన ఊరుచేరి, గ్రామాధికారి అయన కామయ్యకు తాను తెచ్చిన హుకుం చూపించాడు. కామయ్య దాన్ని చూసి, కొంచెం ఆలోచించి, మళ్లా కనపడమని చెన్నయ్యతో అన్నాడు.

చెన్నయ్య వెళ్ళగానే కామయ్య భూషయ్య అనే వాణ్ణి పిలిపించి, చెన్నయ్య తెచ్చిన హుకుం చూపాడు. భూషయ్యకు చెన్నయ్య మీద కోపం వచ్చింది.

'' చెన్నయ్యకు నేను చేసుకునే భూమి మీద కన్ను పడిందా ? ఆ భూమిని వాడి తాత దున్నాడా, తండ్రి దున్నాడా ? బట్టలు నేసుకుని బతికేవాడికి భూమి కావలిసి వచ్చిందా ?'' అన్నాడు భూషయ్య.

'' మీరు ఇలా కోప్పడి ఏం లాభం, భూషయ్యా ? చెన్నయ్య నవాబు నుంచి హుకుం తెచ్చుకున్నాడు. మనం ఏం చెయ్యగలం ?'' అన్నాడు కామయ్య.

'' అందుకని భూమిని వదులుకుంటానా ? అలాటిది మా వంశంలోనే లేదు. ఆ భూమిలో చెన్నయ్య ఎలా కాలు పెడతాడో నేను చూస్తాగా !'' అన్నాడు భూషయ్య.

''ఏమీ లాభం లేదు, భూషయ్యా! అది సర్కారు భూమి,'' అని కామయ్య జ్ఞాపకం చేశాడు.



దాంతో భూషయ్య మెత్తబడి, ఏదన్నా ఉపాయం ఆలోచించమని కామయ్యను అడిగాడు. ఇద్దరూ కూర్చుని ఆలోచన మొదలు పెట్టారు.

ఇంతలో శేషయ్య అనే వాడు వచ్చి, వట్టి చెంబు చూపిస్తూ, "బర్రె పాలను ఎగజేపింది. కట్టిందో ఏమో! ఇక పాలు ఇయ్యదు," అన్నాడు కామయ్యతో.

వెంటనే భూషయ్య, "మరేమీ ఫరవా లేదు. నేను మీకు పాడిబర్రెను పంపుతాను," అని కామయ్యతో అన్నాడు.

కామయ్య సంతోషించి, భూషయ్యకు భూమిని గూర్చి ఒక ఆలోచన చెప్పాడు. "సరే, సరే!" అంటూ భూషయ్య నమస్కారం చేసి వెళ్ళిపోయాడు. కామయ్య ఇల్లు దాటగానె అతనికి చెన్నయ్య కనిపించాడు. భూషయ్య చెన్నయ్యను చురచురా చూసి వెళ్ళిపోయాడు.

చెన్నయ్య సందేహిస్తూ కామయ్య ఇంట్లోకి వెళ్ళాడు.

"చూడు, చెన్నయ్యా! నువు భూషయ్యతో ఎందుకు విరోధం తెచ్చుకున్నావయ్యా? ఎందుకొచ్చిన పీడ నీకు? నువు దున్నేదీలేదు, పండించేదీలేదు. కావాలంటే భూషయ్య చేత నీకు ప్రతిఫలం ఇప్పిస్తానులే," అన్నాడు కామయ్య.

ఈ మాటలకు చెన్నయ్య బాధపడ్డాడు. కామయ్య లంచగొండి అని చెప్పుకునే వాళ్ళు. అది నిజమని ఇప్పుడు తేలిపోయింది. చెన్నయ్య ఏమీ మాట్లాడ



కుండా బయటికి వచ్చేశాడు. దారిలో భూషయ్య మనిషి బర్రెను తోలుకువస్తూ చెన్నయ్యకు కనిపించాడు.

"ఎక్కడికి?" అని చెన్నయ్య వాణ్ణి అడిగాడు.

"కామయ్యకు ఇచ్చిరమ్మని భూషయ్య పంపాడు," అన్నాడు భూషయ్య మనిషి.

తరవాత కామయ్యా, భూషయ్యా కలిసి చెన్నయ్యను బెదిరించీ, కొట్టీ భూమిని భూషయ్యకు అమ్మినట్టు చెన్నయ్య చేత పత్రం రాయించుకున్నారు.

తిరిగి రంజాన్ పండగ రాబోతున్నది. అది ఇంకా రెండు రోజులున్నదనగా నవాబుకు రుమాల జ్ఞాపకం వచ్చింది. ఆయన చెన్నయ్యను పిలిపించాడు. చెన్నయ్య వట్టి చేతులతో రావటం చూసి నవాబు, "ఏం, ఈసారి రుమాల నెయ్యలేదా?" అని అడిగాడు.

"తమరు కోప్పడకుంటే మనవిచేసుకుంటాను. శ్రమకు ఫలితం దక్కలేదు, సర్కార్!" అన్నాడు చెన్నయ్య.

"అరె, పెద్ద అశాపాతకుడిలాగున్నావే! నీ రుమాలకు సాటికాదా నేనిచ్చిన భూమి?" అని నవాబు అడిగాడు.

"నా మనవి అదికాదు, సర్కార్. రుమాలను బర్రె మేసింది. భూమి నాకు దక్కలేదు." అన్నాడు చెన్నయ్య.

"ఏమంటున్నావు? భూమి నీకు దక్కలేదా? నా హుకుం ఏమయినట్టు?" అని నవాబు అడిగాడు కోపంగా.

జరిగినదంతా చెప్పాడు చెన్నయ్య. వెంటనే నవాబు కామయ్యనూ, భూషయ్యనూ పిలిపించి, లంచం తీసుకున్నందుకు కామయ్యను పదవినుంచి తొలగించి, లంచం ఇచ్చినందుకు భూషయ్యకు నూరు రూపాయలు జరిమానా విధించి, భూమిని చెన్నయ్యకు ఇప్పించాడు.

తరవాత చెన్నయ్య భూమి దున్నుకుని, పంట పండించుకుంటూ, భార్యా బిడ్డలతో సంతోషంగా కాలం గడుపుతూ, ప్రతి సంవత్సరమూ రుమాల నేసుకుని వెళ్ళి, నవాబుకు సమర్పిస్తూ వచ్చాడు.



# మాట తీరు

రామశర్మ అనేవాడు వైద్యవిద్య పూర్తిగా నేర్చుకుని, మంచి ప్రవీణుడయాడు. కాని అతనికి వైద్యవృత్తి ఎంతమాత్రమూ అనుకూలించలేదు. అతనికి పొట్టగడవటం కష్టమయింది.

అతను తన మిత్రుడైన ఒక జ్యోతిష్కుడి వద్దకు వెళ్ళి, తన జాతకంలో ఏదో లోపం ఉండి ఉంటుంది, చూడమన్నాడు. "నేను రోగాలను ఎంత బాగా నయం చేస్తున్నా మన వూరి వాళ్ళకు నా మీద గురి కుదరటంలేదు," అన్నాడతను.

"తప్పు నీ జాతకంలో లేదు, నీ నోట్లో ఉన్నది. నీ సంగతి నేను అదివరకే విన్నాను. నువు రోగుల్ని హడలగొట్టేస్తావుట. అందుకే నీ దగ్గిరికి ఎవరూరారు. నెలరోజులు మౌనవ్రతం పట్టి, నా వెంట తిరుగు. ఏం జరుగుతుందో చూడు," అన్నాడు జ్యోతిష్కుడు.

రామశర్మ అలాగే చేశాడు. అతను జ్యోతిష్కుణ్ణి వెంటబెట్టుకుని రోగులను చూడబోయేవాడు. జ్యోతిష్కుడు రోగిని ప్రశ్నలడుగుతూ, ధైర్యం చెప్పేవాడు. రామశర్మ మందు ఇచ్చేవాడు. రోగాలు నయమయాయి.

నెల రోజుల్లో రామశర్మకు ఎక్కడలేని పేరూ వచ్చింది. ఈలోపల అతను రోగులతో ఎలా మాట్లాడాలో నేర్చుకున్నాడు.

—గుండాల విజయ





# పగటిదొంగలు

ఒక నగరంలో సోమిశెట్టి అనే రత్నవర్త కుడు న్యాయంగా వ్యాపారం చేస్తూ లక్షలు గడించాడు. ఆయనలో వేలెత్తి చూపటానికి ఒక్క చెడ్డ గుణం ఉండేదికాదు. ఆయన ఎంతగా డబ్బు సంపాదించేవాడో అంతగా దానధర్మాలు చేస్తూ అంతులేని కీర్తి సంపాదించాడు.

ఆ నగరంలోనే ఇద్దరు గజదొంగలు ఉండేవాళ్ళు. వాళ్ళు పగటి దొంగలు; పట్టపగలే మారు వేషాలు వేసుకుని, యుక్తితో ప్రజలను మోసం చేసేవాళ్ళు. వాళ్ళ సంగతి అందరికీ తెలుసును, కాని వాళ్ళ మోసాలు రుజువు చెయ్యటం ఎవరికీ సాధ్యంకాలేదు. రాజభటులు కూడా విఫలులయారు. ఈ దొంగల కన్ను సోమిశెట్టి పైనపడింది.

వాళ్ళలో చిన్నవాడు జ్యోతిషుడి వేషం వేసుకుని, ఒకనాడు సోమిశెట్టి ఇంటికి వెళ్ళి, సోమిశెట్టి ఆతిథ్యం స్వీకరించి, సోమిశెట్టి జీవితంలో లోగడ జరిగినవీ, ప్రస్తుతం జరుగుతున్నవీ వివరంగా చెప్పాడు.

"అయ్యా, నాకు జరిగినదంతా బాగా చెప్పారు. మీరు జ్యోతిష్యంలో చాలా గొప్పవారులా కనిపిస్తున్నారు. జరగబోయేది కూడా కాస్త చెప్పండి," అన్నాడు సోమిశెట్టి.

"త్వరలోనే ఒక మహానుభావుడు నీ ఇంటికి వస్తాడు. అతని దయవల్ల నీ ధనం పదింతలు అవుతుంది," అన్నాడు చిన్న దొంగ.

శెట్టి అతనికి కొంత బహుమానం ఇచ్చి పంపబోయాడు. కాని అతను ఏమీ తీసుకోలేదు. అలా చెయ్యటంవల్ల శెట్టికి తనమీద మరింత నమ్మకం ఏర్పడుతుందని అతను అనుకున్నాడు.

వీరేపల్లి జయరాంరెడ్డి

ఒక వారం గడిచింది. భోరున వర్షం కురుస్తున్నది. పెద్ద దొంగ యోగి వేషాన్నీ, చిన్న దొంగ శిష్యుడి వేషాన్నీ వేసుకుని, శెట్టిగారి వసారాలోకి వచ్చి నిలబడ్డారు. తరవాత కొంతసేపటికి తలుపు తట్టిన చప్పుడు విని, సోమిశెట్టి వచ్చి తలుపు తెరిచాడు.

పెద్ద దొంగ శెట్టితో, "వర్షం హెచ్చుగా ఉన్నది. ఈ రాత్రికి మీ ఇంట మాకు ఆశ్రయం ఇయ్యగలవా, నాయనా?" అన్నాడు.

"నిరభ్యంతరంగా ఇస్తాను. లోపలికి దయచెయ్యండి," అన్నాడు శెట్టి.

ఆయన దొంగలిద్దరికీ భోజనం ఏర్పాటు చేశాడు. భోజనాలు అయాక చిన్నవాడు శెట్టితో, "మా గురువుగారు అఖండ తపశ్శక్తితో సువర్ణయోగాన్ని సాధించారు. ఆయన తలుచుకుంటే వరహాను పదివరహాలు చెయ్యగలరు. రేపు ఉదయం ఆయన మీకు తమశక్తి చూపిస్తారు," అన్నాడు.

సోమిశెట్టి పెద్ద దొంగతో, "స్వామీ, మీ విషయం వారం రోజులక్రితం నా ఇంటికొచ్చిన ఒక జ్యోతిష్కుడి ద్వారా విన్నాను. మీ రిక్కడికి రాగలరని ముందే తెలిసింది," అన్నాడు.

ఆ రాత్రి శెట్టి వాళ్ళిద్దరూ పడుకోవటానికి ఒక గది ఇచ్చి, తన నౌకరు చేత గదికి బయటినుంచి గొళ్ళెం పెట్టించాడు. అర్థరాత్రివేళ దొంగలిద్దరూ శెట్టిగారి ఇల్లు



సోదాచేద్దామనుకున్నారుగాని, బయట గొళ్ళెంపెట్టి ఉండటంచేత అది సాధ్యం కాలేదు.

మర్నాడు తెల్లవారేలోపుగా శెట్టి తన నౌకర్లకు చెప్పవలసిందంతా చెప్పి పంపేసి, దొంగలు పడుకున్న గది గొళ్ళెం తీయించాడు.

తెల్లవారినాక దొంగలు సోమిశెట్టిని పెరట్లోకి తీసుకువెళ్ళి, అక్కడ అగ్నిహోత్రంచేసి, చిన్న యజ్ఞం ప్రారంభించారు. పెద్ద దొంగ ఏవో మంత్రాలు చదువుతూంటే, చిన్నవాడు శెట్టి కేసి చూసి, ''నూరు బంగారు కాసులు పట్టుకురండి,'' అన్నాడు.

శెట్టి లోపలికి వెళ్ళగానే పెద్ద దొంగ తన సంచీ నుంచి దొంగ సొమ్ము వెయ్యి బంగారు కాసులు తీసి మట్టిలో పాతిపెట్టాడు.

తరవాత శెట్టి నూరు బంగారు కాసులు తెచ్చి ఇచ్చాడు. దొంగ దాన్నికూడా అదే ప్రదేశంలో మటిలో పూడ్చి, మంత్రాలు చదివి, వెయ్యి కాసుల సంచి తీసి శెట్టికి చూపించాడు.

శెట్టి చూస్తానని ఆ సంచీ తీసుకుని, '' అహా, మీ శక్తి అద్భుతం! కాని నేను ఆశాపాతకుణ్ణి కాను! ప్రస్తుతానికి నాకు ఇదిచాలు!'' అన్నాడు.

ఇది చూసిన మీదట శెట్టి తన దగ్గిర ఉన్న డబ్బంతా తమకు ఇచ్చేస్తాడనుకున్నారు దొంగలు. శెట్టి వాలకంచూస్తే అసలుకే మోసం వస్తున్నది. ఇద్దరూ కూడ బలుక్కున్నట్టు ఒక్కసారిగా శెట్టి మీదపడి ఆయన చేతిలోని సంచీ లాక్కోబోయారు. కాని ఇంతలోనే చెట్ల చాటునుంచి రాజభటులు వచ్చి దొంగలిద్దరినీ పట్టుకున్నారు.

శెట్టి వాళ్ళతో, '' మీరు అనుకున్నంత అమాయకుణ్ణికాను. అమాయకులను మోసంచేసి, లోకమంతా అమాయకులే అనుకున్నారు మీరు,'' అన్నాడు.

రాజు వాళ్ళకు శిక్షవిధిస్తూ, సోమిశెట్టికి మంచి సన్మానం చేశాడు.



# మారిన సన్యాసి

భార్యా, ఇద్దరు పిల్లలూగల రామయ్యకు సన్యాసం పుచ్చుకోవాలన్న చిత్రమైన కోరిక పుట్టింది. తమను వదిలి వెళ్ళిపోవద్దని భార్య ఎంత బతిమాలినా రామయ్య వినలేదు.

"సన్యాసానికి అందరూ అర్హులుకారు. నీ పిల్లలు మరీ చిన్నవాళ్ళు. వాళ్ళకు ఒకదారి చూపించే భారం నీమీదే ఉన్నది గదా!" అని నలుగురూ చెప్పారు. రామయ్య వాళ్ళమాటలూ లక్ష్యపెట్టలేదు.

ఒక ఉదయం రామయ్య ఇల్లు వదలటానికి సిద్ధమవుతుండగా, "ఇంత చద్ది అన్నం మూటగట్టి ఇస్తాను. తీనుకు వెళ్ళండి," అన్నది భార్య.

రామయ్య భార్య ఇచ్చిన మూట తీనుకుని బయలుదేరి, మధ్యానం దాకా నడిచి, ఒక చెట్టు కింద కూర్చుని, మూట విప్పాడు. మూటలో ఉన్నది రంపపు పొట్టు!

పట్టరాని కోపంతో రామయ్య ఇంటికి తిరిగి వచ్చి, భార్య మీద విరుచుకు పడ్డాడు.

"సన్యాసికి బంధాలూ, కోరికలూ ఉండరాదు, నిగ్రహం ఉండాలి," అన్నది భార్య. వెంటనే రామయ్య సన్యాసం పుచ్చుకునే ఆలోచన మానుకున్నాడు.

—పి. యస్. పి. జగన్మోహనరావు.





# జ్ఞానోదయం

ఒకప్పుడు ధారానగరాన్ని శూరసేనుడు అనే రాజు పాలించేవాడు. అతడు ప్రతి చిన్న విషయంలోనూ తన గొప్పతనం కనిపించాలని తాపత్రయపడేవాడు. రాజ్యంలో తన అధ్వర్యం లేకుండా ఏ చిన్న కార్యంకూడా జరగరాదు అన్న పట్టుదల ఆయనకు ఉండేది.

ఆ రాజ్యంలో ఆనందుడు అనే శివ భక్తుడు ఉండేవాడు. అతడు బీద సాద లకు చేతనైన సహాయం చేస్తూ, మంచి వాడుగా పేరు తెచ్చుకున్నాడు. అతనికి ఒక శివాలయం కట్టించాలనే తలంపు కలిగి, పదిమంది దగ్గిరా చందాలు పోగు చేసి, ఈశ్వరుడికి ఒక ఆలయం కట్టించాడు.

ఆలయంలో ప్రాణప్రతిష్ఠ అయినాక మొదటి పూజ ఎవరిది చేయాలి అన్న సమస్య వచ్చింది. ఆలయం చిన్నది. దాన్ని కట్టటానికి పెద్దగా చందాలు వేసిన వారూ, శివభక్తులుగా ప్రసిద్ధులైనవారూ కొందరు ఉన్నారు. అయినా రాజుగారు ఇటువంటి విషయాలలో చాలా పట్టుదల గలవాడు. మొదటి పూజ మహారాజుది కావటమే మంచిది; లేకపోతే ఆయనకు కోపం రావచ్చునని ఆనందుడు అను కున్నాడు.

అతడు శూరసేనుడి వద్దకు వెళ్ళి, "మహారాజా, నీలకంఠుని కోసం ఒక ఆలయం కట్టించాను. అందులో మొదటి పూజ తమచేత జరిపించాలని వచ్చాను," అన్నాడు.

ఈ మాటకు రాజు సంతోషించి, "అలాగే! శివాలయం కట్టేపని పూర్తయిం దన్నమాట. పూజ ఏ రోజు జరిపించ బోతున్నారు? మేము ఎప్పుడు రావాలి?" అని ఆనందుణ్ణి అడిగాడు.

కే. బి. యస్. కుమార్, బి.కాం.

"రేపు సరిగ్గా ఎనిమిది గంటలకు ప్రాణప్రతిష్ఠ అయిపోతుంది. మీరు అదే సమయానికి వస్తే, మొట్టమొదటి పూజ మీదే జరుగుతుంది," అన్నాడు ఆనందుడు.

"తప్పకుండా వస్తాం," అని రాజు ఆనందుణ్ణి పంపేశాడు.

మర్నాడు ఎనిమిది గంటలకు మొదటి పూజకు అంతా సిద్ధంగా ఉన్నది. జనమంతా రాజుగారి రాకకోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నారు. కాని రాజు మాత్రం రాలేదు.

రాజు కోసం చాలా సేపు చూసి, ముహూర్త ఘడియ మించిపోవటం అశుభమనుకుని, ఆనందుడు తనపూజతో ప్రారంభించి, తరవాత ఒక్కొక్కరి పూజా చేయించ సాగాడు.

తన రాకకోసం ఎంత ఆత్రంగా జనం ఎదురు చూస్తూ ఉంటారో చూడాలన్న ఉద్దేశంతో, రాజు కావాలనే ఆలస్యంగా బయలుదేరి వచ్చాడు. అప్పటికే చాలా మంది నగరవాసులు పూజలు జరిపించి వెళ్ళిపోయారు.

రాజుకు సంగతి అంతా తెలిసింది. ఆయన ఎక్కడ లేని కోపంతో, నిలువెల్లా వూగిపోతూ, "ఈ ఆలయంలో మొదటి పూజ జరిపించినది ఎవరు?" అని ఆనందుణ్ణి అడిగాడు.

"నేనే, మహారాజా! నన్ను క్షమించండి. ముహూర్తం మించి పోవటం



అశుభ మనుకుని నా పూజే మొదట జరిపించాను," అన్నాడు ఆనందుడు వినయంగా.

"నీచుడా, నన్ను మొదటి పూజకు ఆహ్వానించి, అవమానిస్తావా? వీణ్ణి ఆలయం ముందే ఉరి తీయండి!" అని రాజు ఆజ్ఞాపించాడు.

మరుక్షణంలోనే గర్భగుడిలో నుంచి ఈ మాటలు మారుమోగాయి :

"మూర్ఖుడా! నా ఆలయం ముందు నా భక్తుణ్ణి ఉరి తీస్తావా? నీ అల్పబుద్ధితో ప్రజల్ని పీడిస్తున్నావు! నిన్నూ, నీ వంశాన్నీ నాశనం చేస్తాను."

అందరూ దేవుడికి ఆగ్రహం వచ్చిందనుకున్నారు.

రాజు వణికిపోతూ, "స్వామీ, నా తప్పు మన్నించండి. ఇంకెన్నడూ నా అల్పత్వంతో ప్రజలను బాధపెట్టను," అన్నాడు.

ఆ మరుక్షణం లోపలినుంచి మళ్ళీ ఇలా వినిపించింది:

"శూరసేనా, నీ గొప్పదనం ఇతరులు చెప్పుకోవాలిగాని, నువే ప్రదర్శించరాదు. నిత్యమూ నన్ను ధ్యానించు. నీకూ, నీ రాజ్యానికీ శుభం చేకూర్చుతాను."

శూరసేనుడు తన పూజ ముగించి, నమ్రతగా వెళ్ళిపోయాడు.

ఆనందుడికి మాత్రం ఇదంతా ఆశ్చర్యంగా ఉన్నది. అందరూ వెళ్ళిపోయాక ఆయన గర్భగుడిలోకి వెళ్ళి చూశాడు. లింగం కింది దిమ్మ వెనకనుంచి అతని శిష్యుడు నవ్వుకుంటూ ఇవతలికి వచ్చాడు.

"మీరు మొదటి పూజ జరిపినప్ప[illegible] రాజు మిమ్మల్ని శిక్షిస్తాడని ఊహించి, ఇలా చేశాను. రాజుకు ఎవరో ఒకరు, ఏదో ఒక విధంగా జ్ఞానోదయం కలిగించాలి గద!" అన్నాడు శిష్యుడు.

ఆనందుడు క్షణంపాటు ఆశ్చర్యపడి, "అవునురా! నువు అంతపనీ చేశావు!" అంటూ శిష్యుణ్ణి కౌగలించుకున్నాడు.

అటు తరవాత శూరసేనుడు ప్రతి దానికీ, "ముందు నేను!" అంటూ రావటం మానుకుని, చాలా కాలంపాటు బాగానే రాజ్యం చేశాడు.





# కరువులో ధరలు

ఒక గ్రామంలో వ్యవసాయమంతా చెరువుల కింద జరిగేది. ఆ గ్రామంలో ధనశ్రేష్ఠి అనే వర్తకుడు ఉండేవాడు. ఊరిలో ఉండే పొలాలూ, తోటలూ సగం పైగా ధనశ్రేష్ఠివే.

ఒక ఏడు బొత్తిగా వర్షాలు లేక చెరువులన్నీ ఎండిపోయాయి. తోటలన్నీ ఎండిపోయాయి. నారుమళ్లు ఎండిపోయి నాట్లు పడలేదు. ధనశ్రేష్ఠి తన దగ్గిర ఉన్న ధాన్యం హెచ్చు ధరకు అమ్ముకున్నాడు. ఆ ధాన్యం కూడా అయిపోయింది.

ధనశ్రేష్ఠి ఉండే గ్రామంలోని చెరువులో అట్టడుగున కొద్దిపాటి నీరు ఉండిపోయింది. అది కాలవలకు ఎక్కదు, చేలకు పారదు. ధనశ్రేష్ఠి ఆ నీటిని పీపాలతో పట్టుకుపోయి తన మామిడి తోటను బతికించుకోగలిగాడు. ఆ తోట ఆ యేడు బ్రహ్మాండమైన కాపు కాచింది.

తిండి గింజ దొరకని దశలో ఊరివాళ్లు శ్రేష్ఠిగారి మామిడిపళ్ళు కొనుక్కుని తినటానికి రాసాగారు. శ్రేష్ఠి ఒక్కొక్క పండు అర్ధరూపాయ చెప్పాడు. లోగడ ఈ శ్రేష్ఠి ఇవే మామిడిపళ్ళను వంద రెండు రూపాయలకు అమ్మాడు. గ్రామస్థులు ఆ మాట అంటే శ్రేష్ఠి, "కరువులో ధరలు ఇలాగే ఉంటాయి," అన్నాడు.

అయితే గ్రామస్థుల దగ్గిర డబ్బు లేదు. ఉన్న డబ్బంతా శ్రేష్ఠికే ఇచ్చి వాళ్ళు ధాన్యం కొనుక్కున్నారు.

"కొనటానికి డబ్బు లేని వాళ్ళు ఋణపత్రాలు రాసి పళ్ళు కొనుక్కోండి," అన్నాడు శ్రేష్ఠి.

ఋణం తీర్చే మాట తరవాత చూసుకోవచ్చునని, ఆకలి బాధ తీరటానికి ఋణపత్రాలు రాసి, శ్రేష్ఠి వద్ద ప్రజలు మామిడిపళ్ళు కొనుక్కుని తినేశారు.

కె. నాగేశ్వరరావు

ఈ అవకాశం మళ్ళీ రాదని, శ్రేష్ఠి తన చిత్తం వచ్చినట్టుగా వడ్డీ వేసి పత్రాలు రాయించుకున్నాడు.

కరువు పోయింది. వర్షాలు పడి చెరువులు నిండాయి. మళ్ళీ తోటలూ, పొలాలూ కళకళలాడాయి. అయితే, ఊళ్ళోని రైతులకు శ్రేష్ఠి బాధ మాత్రం పోలేదు. తోటల్లోని కాపు అంతా శ్రేష్ఠి బాకీల కింద వసూలు చేసుకున్నాడు. పొలాలు లేని వాళ్ళచేత వెట్టి చేయించుకున్నాడు.

శ్రేష్ఠి బాధ నుంచి తమను కాపాడమని గ్రామస్థులు గ్రామాధికారిని అడిగారు. గ్రామాధికారి శ్రేష్ఠిని పిలిపించి, "వీళ్ళంతా బతికి ఉన్నంత కాలమూ మీకు వెట్టి చేసినా మీ బాకీ తీరదు. ఎంతో కొంత తీసుకుని వాళ్ళ పత్రాలు వాళ్ళకు ఇచ్చెయ్యండి!" అని సలహా యిచ్చాడు.

శ్రేష్ఠి అందుకు ఎంత మాత్రమూ ఒప్పుకోలేదు.

"అలా అయితే, ఇంకో పద్దు కూడా చూడవలసి ఉన్నది. ఊళ్లో అన్ని తోటలూ ఎండిపోగా మీ ఒక్కరి తోట ఎలా బతికింది? చెరువు నీరు పీపాలతో పోయించారు కాదూ? మీరే గ్రామప్రజలకు అప్పుపడ్డారు," అన్నాడు గ్రామాధికారి.

"అదెలా?" అన్నాడు శ్రేష్ఠి.

"చెరువు నీరు నీ సొత్తు కాదు. గ్రామం ఉమ్మడి సొత్తు. పీపా నీటి ఖరీదు పది రూపాయల చొప్పున నువ్వు గ్రామస్థుల నుంచి ఎంత వెలగల నీరు కొనుక్కున్నావో లెక్క కట్టిస్తాను," అన్నాడు గ్రామాధికారి.

"అన్యాయం. ఒక్క పీపా నీరు పది రూపాయలా?" అన్నాడు శ్రేష్ఠి.

"ఔను, కరువులో ధరలు అట్లాగే ఉంటాయి," అన్నాడు గ్రామాధికారి.

శ్రేష్ఠి తాను బాకీల కింద పుచ్చుకున్నదంతా ఎవరిది వారికి ఇచ్చేసి, వెట్టి చేయించుకున్న వాళ్ళకు కూలి ఇచ్చుకుని, ఋణపత్రాలన్నీ చించేశాడు.






మైనాకుడు తనకు సాదరంగా ఆతిథ్యం ఇస్తానన్నందుకు హనుమంతుడు సంతోషించి, "నీ మాటలే నాకు గొప్ప ఆతిథ్యం. నీ ఆతిథ్యం నిరాకరిస్తున్నందుకు కోపించవద్దు. నేను ఈ సమయంలో ఏ మాత్రమూ జాప్యం చెయ్యరాదు. సాయంకాలం లోపుగా తిన్నగా లంకకు పోతానని మాట ఇచ్చి ఉన్నాను. మధ్యలో నేను ఆగకూడదు," అన్నాడు.

ఇలా అని హనుమంతుడు మైనాక పర్వతాన్ని చేత్తో తాకి, ఆకాశ మార్గాన ముందుకు సాగాడు. "నీకు కార్య సిద్ధి కలుగుగాక!" అని మైనాకుడూ, సముద్రుడూ హనుమంతుణ్ణి ఆశీర్వదించారు. హనుమంతుడు మైనాక పర్వతాన్ని చూస్తూ ఆకాశంలోకి ఇంకా ఎత్తుగా పోయి, ముందుకు వెళ్లాడు.

ఇది అంతా చూస్తున్న దేవతలూ, మహర్షులూ, సిద్ధులూ, దేవేంద్రుడూ మైనాకుణ్ణి మెచ్చుకుని, "మైనాకుడి అంత గొప్పవాడి ఆతిథ్యం నిరాకరించటం ఒక్క హనుమంతుడికే తగింది. లోకంలో మరెవరూ అలాచేసి ఉండరు," అనుకున్నారు.

ఇంద్రుడు మైనాకుడితో, "మైనాకుడా, నిన్ను చూసి చాలా సంతోషించాను. ఇక ఎన్నడూ నీకు నా భయం ఉండదు," అన్నాడు. ఈ మాట విని మైనాకుడు కూడా తనకు ఇంద్రుడి భయం తీరిపోయినందుకు ఎంతో సంతోషించాడు.

11. సముద్రతరణం



ఈ లోపుగా హనుమంతుడు సముద్రం మీద చాలా దూరం వెళ్లిపోయాడు. ఆ సమయంలో దేవతలూ, గంధర్వులూ మొదలైన వారికి హనుమంతుడి బలం ఇంకా ఎంత ఉన్నదో చూడాలన్న కోరిక కలిగింది. వాళ్లు సర్పాలకు తల్లి అయిన సురస వద్దకు వెళ్లి, ''హనుమంతుడనే వాడు, వాయుపుత్రుడు, సముద్రం మీదిగా ఎగిరి వెళ్లుతున్నాడు. నువ్వు పర్వతాకారం గల రాకసి రూపం ధరించి, పెద్ద కోరలూ, గోరోచనం రంగుగల కళ్లూ పెట్టుకుని, అతణ్ణి అటకాయించు. అతను నిన్ను గెలిచి ముందుకు పోతాడో, లేక భయపడతాడో చూడాలి,'' అన్నారు.

సురస దేవతల కోరికను పాటించి, మహా భయంకరమూ, వికారమూ అయిన శరీరం ధరించి, హనుమంతుడి మార్గానికి అడ్డంగా నిలబడి ''ఓ, హనుమంతుడా, దేవతలు నిన్ను నాకు ఆహారంగా ఇచ్చారు. నిన్ను తింటాను. నా నోట ప్రవేశించు,'' అని నోరు తెరిచింది.

ఈ మాట విని హనుమంతుడు ముఖాన సంతోషం కనబరుస్తూ, చేతులు జోడించి, ''దశరధుడి కొడుకైన రాముడు అనేవాడు, లక్ష్మణుడు అనే తమ్ముడితోనూ, సీత అనే భార్యతోనూ దండకారణ్యానికి వచ్చాడు. ఆ రాముడు కార్యాంతరము మీద ఉన్న సమయంలో రావణుడు సీతను ఎత్తుకు పోయాడు. నేను రాముడి దూతగా సీత దగ్గిరికి పోతున్నాను. అందుకు నువ్వు కూడా సహాయపడు. లేదంటావా, సీతను చూసి, రాముడి పని పూర్తిచేసి, నేనే నీ నోటిలోకి వస్తాను. ఇది నిజం,'' అన్నాడు.

ఈ మాటకు సురస, ''నన్నుదాటి ఎవరూ పోలేరు. అలా నాకు వరం ఉన్నది,'' అన్నది.

సురస నోరు తెరుచుకుని ఉన్నది. ఆ నోరు పెద్ద గుహలాగా ఉన్నది. హనుమంతుడు తన శరీరాన్ని అంగుళం ప్రమాణానికి తగ్గించి, అతి వేగంగా సురస

నోట్లోకి పోయి మళ్లీ బయటకి వచ్చి, "దక్షుడి కూతురా, నమస్కారం. నీ నోట్లోకి వెళ్లి వచ్చాను. ఇక నన్ను సీత దగ్గిరికి వెళ్లనీ," అన్నాడు.

సురస వెంటనే రాక్షసి రూపం మాని తన మామూలు రూపం ధరించి, "హనుమంతుడా, నువు సుఖంగా వెళ్లిరా. నువు వెళ్లే పని జరుగుతుంది. సీతా రాములను తిరిగి కలుపు," అన్నది.

హనుమంతుడు తిరిగి లంక కేసి ఎగురుతూ వెళ్లాడు. అతను అలా ఆకాశంలో వెళ్లుతూండగా సముద్రంలో ఉన్న సింహిక అనే రాక్షసి చూసి, "ఇదేదో జంతువు నా పాలపడింది. దీన్ని తిని నా ఆకలి తీర్చుకుంటాను," అనుకుని, హనుమంతుణ్ణి అతని నీడను పట్టుకుని లాగసాగింది.

ముందుకు పోయే పెద్ద ఓడను బలమైన ఎదురుగాలి వెనక్కు తోసుకు పోయినట్టుగా అయింది హనుమంతుడి పని. అతను అమిత ఆశ్చర్యంతో అన్నిపక్కలా, పైనా, కిందా చూసేసరికి, సముద్రంలో తేలుతూ ఒక మహా జంతువు కనిపించింది. దక్షిణ సముద్రంలో ఒక అద్భుత శక్తిగల జంతువు ఉన్నదనీ, అది నీడను పట్టుకుని లాగగలదనీ సుగ్రీవుడు ముందే చెప్పాడు. ఇదే



ఆ జంతువు అయి ఉంటుందని హనుమంతుడు గ్రహించాడు.

అతను తన దేహాన్ని పెంచాడు. అది చూసి సింహిక తన శరీరాన్ని పెంచి, తన నోరు హనుమంతుడి శరీరం కన్న పెద్దదిగా చేసి తెరిచి, అతన్ని కబళించబోయింది. ఆ సమయంలో హనుమంతుడు సింహిక శరీరం లోపలి మర్మాంగాలు కనిపెట్టాడు. అతను వెంటనే తన శరీరాన్ని చిన్నదిగా చేసి, సింహిక నోటిలోకి పోయి, దాని మర్మాంగాలు చీల్చి, అది తిరిగి నోరు మూసుకునే లోపల బయిటికి వచ్చేసి, శరీరం మామూలు ప్రమాణానికి పెంచాడు. గుండె చీలి



పోయి సింహిక కళేబరం సముద్రం మీద తేలింది.

హనుమంతుడు మళ్ళీ ప్రయాణం సాగించాడు. ఇప్పుడతనికి సముద్రం అవతలి తీరమూ, చాలా దూరాన అరణ్యాలూ కనిపిస్తున్నాయి. లంకా ద్వీపమూ, మలయపర్వతం మీది వనాలూ, నదులు సముద్రంలో కలిసే ప్రదేశాలూ కూడా కనబడుతున్నాయి.

అతనికి ఒక ఆలోచన వచ్చింది: తన ఈ పెద్ద దేహాన్నీ, వేగాన్నీ రాక్షసులు చూసినట్టయితే తను వచ్చిన పని పాడవుతుంది. అందుచేత అతను తన శరీరాన్ని చాలా చిన్నదిగా చేసుకున్నాడు. అతను సముద్ర తీరానగల ఒక కొండ శిఖరం మీద వాలి, దేవేంద్రుడి అమరావతికి తీసిపోని లంకానగరాన్ని చూశాడు.

లంకా నగరం త్రికూటశిఖరం మీద ఉన్నది. హనుమంతుడు లంకా నగరం కేసి పోతూ, బాగా పూచి, దట్టంగా ఉన్న చెట్లుగల పర్వత శిఖరాలనూ, ఉద్యాన వనాలనూ చూశాడు. అతనికి అనేక రకాల పూలచెట్లూ, పక్షులూ, పౌర ఉద్యానాలూ, రాజ ఉద్యానాలూ, అనేకమైన అందమైన దృశ్యాలూ కనిపించాయి.

లంకానగరం చుట్టూ అగడ్తలున్నాయి. వాటిలో తామరలూ, కలువలూ ఉన్నాయి. నగరం చుట్టూ బంగారు ప్రాకారాలున్నాయి. నగరంలోకి ఎవరూ పోకుండా సాయుధులైన రాక్షసులు కాపలా కాస్తున్నారు. చాలా ఎత్తుగా, తెల్లగా ఉన్న ఇళ్ళ మధ్యగా వీధులున్నాయి. ఎక్కడ చూసినా కోట బురుజులున్నాయి; జెండాలున్నాయి. త్రికూట శిఖరం మీద ఉన్న కారణంగా లంకానగరం ఆకాశంలో నిర్మించినట్టుగానే కనబడింది. దాన్ని నిర్మించినవాడు విశ్వకర్మ.

హనుమంతుడు క్రమంగా లంకా నగరపు ఉత్తర ద్వారాన్ని చేరుకుని, రావణుడి బలం ఎంతటిదో గ్రహించటానికి ప్రయత్నించాడు. ఈ మహా నగ



రాక్షసులంటే చాలా క్రూరులు, సామం వల్ల వారిని జయించటం సాధ్యం కాదు. సంపదలో మునిగి తేలుతున్న వాళ్ళకు దానోపాయం పని చెయ్యేదు. బల గర్వం గల వాళ్ళు కావటంచేత భేదోపాయం పారదు. అతి బలం గల వాళ్ళు గనక యుద్ధానికి అవకాశం లేదు. ఇంతకూ సముద్రం దాటి ఇక్కడికి వచ్చే శక్తి నలుగురికి మాత్రమే ఉన్నది - తనకూ, అంగదుడికీ, నీలుడికీ, సుగ్రీవుడికీనూ! మరెవ్వరూ రాలేరు.

ఇలా ఆలోచిస్తున్న హనుమంతుడికి తన ఆలోచన అప్రస్తుతమని తోచింది. "ఈ ఆలోచనలన్నీ ఇప్పుడెందుకు? ముందు సీత బతికి ఉన్నదో, లేదో తెలుసుకోవాలి. బతికి ఉంటే సీతను చూడాలి. తరవాతనే ఏ ఆలోచన అయినా!" అనుకున్నాడతను.

రాన్ని జయించటం ఎవరితరం? ఒకప్పుడు ఇది కుబేరుడిది, కాని ఈ నాడు కుబేరుడు కూడా ఇందులో ప్రవేశించలేడు. గుహకు పాములు కాపలా ఉన్నట్టు, ఈ నగరానికి సాయుధులైన రాక్షసులు కాపలా ఉన్నారు; దానికి రక్షగా దాటరాని సముద్రం ఉన్నది. వానరులు సముద్రాన్ని దాటి ఇక్కడికి రావటమే అసాధ్యం; ఒక వేళ వచ్చినా ప్రయోజనం ఉండదు. ఎందుకంటే, ఈ లంకను దేవతలు కూడా జయించలేరు. రాముడు ఎంత పరాక్రమ వంతుడైతేమాత్రం ఏం లాభం? లోపలికి పోవటమే అసాధ్యమైన ఈ లంకా నగరంలో రాముడు ఏం చెయ్యగలడు?

అతని మొదటి సమస్య లంకానగరం ప్రవేశించటం. మరీ పెద్ద శరీరంతో ప్రవేశిస్తే రాక్షసులకు అతను దొరికి పోతాడు. మరీ చిన్న శరీరమైతే లంక అంతా కలయ దిరగటం చాలా కష్టమవుతుంది. అందుచేత హనుమంతుడు తన శరీరాన్ని అంత పెద్దదీ, మరీ చిన్నదీ కాకుండా చేసుకుని, రాత్రివేళ లంక అంతా తిరగ నిశ్చయించాడు. సీతను చూచేలోపల

అతను రాక్షసులకు దొరికి పోవటం ప్రమాద కరం; వాళ్ళు అతన్ని తీసుకు పోయి రావణుడి ముందు పెడతారు. రావణుడు దూత అని మన్నించి, వదిలే వాడు కాడు.

అందుచేత హనుమంతుడు సూర్యుడు అస్తమించేదాకా వేచి ఉండి, తన శరీ రాన్ని పిల్లి ప్రమాణానికి తగ్గించుకుని, చూడటానికి వింతగా కనిపించాడు. అతను మామూలు కోతిలాగే దూకుతూ, లంకా నగరం సమీపించాడు.

నగరంలో వీధులన్ని తీర్చి దిద్దినట్టుగా ఉన్నాయి. ఇళ్ళకు చక్కని ప్రాకారా లున్నాయి. వెండి స్తంభాలూ, బంగారు స్తంభాలూ ఉన్నాయి; బంగారు పూత గల కిటికీలున్నాయి. మేడలు ఏడెనిమిది అంతస్తులు గలవి. నగరంలో ఎక్కడ చూసినా స్ఫటికంతోనూ, మణులతోనూ చేసిన అలంకరణలున్నాయి. లంకా నగరం గంధర్వ నగరంలా గున్నది. భయంకరులైన రాక్షసుల రక్షణలో ఉన్న ఆ నగరాన్ని వానరులు ఎలా జయిస్తారో హనుమంతుడికి అంతుబట్టలేదు. సీతను చూడ బోతున్నానన్న సంతోషంలో అతను ఈ విచారాన్ని మరిచిపోయాడు.

అంతలో చంద్రోదయమయింది. లంక స్త్రీరూపంలో, భయంకరాకారంతో హను



మంతుడి ముందు ప్రత్యక్షమై, "ఎవరు నువు? ఎందుకు ఇక్కడికి వచ్చావు? నీవంటి కోతి ఈ లంకానగరంలోకి అడుగు పెట్టరాదు," అన్నది.

దానికి హనుమంతుడు, "నీకు కావలి సినదంతా చెబుతాను. ముందు నువు ఎవతెవో చెప్పు. నగరద్వారం దగ్గిర నన్ను అటకాయించి ఎందుకు బెదిరిస్తున్నావు?" అని అడిగాడు.

"మహా పరాక్రమశాలి అయిన రావ ణుడి కింకరిని నేను. రావణుడి ఆజ్ఞచేత నేను లంకాపట్టణాన్ని రక్షిస్తున్నాను. నన్ను జయించి ఎవరూ ఈ నగరంలోకి పోలేరు. నిన్నిప్పుడే చంపేస్తాను. నేనే ఈ

లంకను. ఇక నీ సంగతి చెప్పు,'' అన్నది లంక కోపంగా.

''నాకు లంకా నగరం చూడాలని పించి ఇలా వచ్చాను,'' అన్నాడు హను మంతుడు.

''నన్ను జయించి గాని నువు లంకా నగరాన్ని చూడలేవు," అన్నది లంక.

''నేను నగరం చూసి నా దారిన వెళ్లి పోతాను. ఇంకేమీ చెయ్యను,'' అన్నాడు హనుమంతుడు.

లంక భయంకరంగా అరిచి, హను మంతుణ్ణి చేత్తో కొట్టింది. హనుమంతుడు మరింత భయంకరంగా అరిచి, ఎడమ చేతి పిడికిలితో లంకను పొడిచాడు. ఆ దెబ్బకే లంక విలవిలా తన్నుకుంటూ కింద పడి, ''అయ్యో, నన్ను చంపకు. నువు చాలా బలంగలవాడివి. నన్ను ఒక కోతి జయించిన నాడు రాక్షసులకు ప్రమాదమని బ్రహ్మ ఒకప్పుడు చెప్పాడు. రావణుడు సీతను తీసుకురావడం వల్ల ప్రమాదం రానున్నట్టు కనబడుతుంది. వెళ్ళి, నగరమంతా నీ యిష్టం వచ్చినట్టు తిరుగు,'' అన్నది.

తరవాత హనుమంతుడు నగరంలోకి ద్వారంకుండా ప్రవేశించక, శత్రువుకు తగినట్టుగా ప్రాకారం మీది నుంచి దూకి, ఎడమకాలు ముందు నగరంలో పెట్టాడు. అతడు రాజవీధి వెంబడి పోతూంటే, సంగీత వాద్యాల ధ్వనులూ, మనుషులు నవ్వుతున్న ధ్వనులూ వినిపించాయి. ఇళ్ళు చాలా ఎత్తుగా, మణులతోనూ, పుష్పమాలలతోనూ అలంకరించి, ఎంతో అందంగా ఉన్నాయి. ఆడవాళ్ళు మద్యం తాగి, మూడు స్థాయిలలోనూ మనోహ రంగా పాడుతున్నారు. కొందరు రాక్షసుల ఇళ్ళ నుంచి. వేదపఠనం వినిపిస్తున్నది. కొందరు రాక్షసులు గట్టిగా అరుస్తున్నారు. వీధులలో అక్కడక్కడా రాక్షస సైని కులు కూడి ఉన్నారు.

''ప్రవేశించరాని లంకలో ప్రవేశిం చాను. సీతను తప్పక చూస్తాను,'' అను కున్నాడు హనుమంతుడు.






యథా కందుకపాతేనో
త్పతత్యార్యః పతన్నపి,
తథా త్వనార్యః పతతి
మృత్పిండపతనం యథా. 1

[సత్పురుషుడు కింద పడినా కూడా బంతిలాగా తిరిగి పైకి వస్తాడు. హీనుడు పడిపోతే మట్టిముద్ద లాగా అలాగే పడి ఉంటాడు.]

య దచేతన్యోపి పాదైః
స్పృష్టః ప్రజ్వలతి సవితు
రినకాంతః, తత్తేజస్వీపురుషః
పరకృతవికృతిః కథం సహతే ? 2

[సూర్యకాంతమణి చైతన్యం లేనిదైనా సూర్యకిరణాలు తాకి వెలుగుతుంది. అలాటప్పుడు మానవంతుడు ఇతరుల వల్ల కలిగే అవమానాన్ని ఎలా సహిస్తాడు ?]

పాదాహతం యదుత్థాయ
మూర్ధాన మధిరోహతి;
స్వస్థా దేవావమానేపి
దేహిన స్తద్వరం రజః. 3

[కాలుతొక్కిన ధూళి ఎగిరి నెత్తిమీద పడుతుంది. అవమానం పొంది కూడా చలించని వాళ్ళకంటె ఆ ధూళి మెరుగైనది గదా!]

పౌరుషవంతుల పద్ధతి

Photo by M. Natarajan



బహుమతి
పొందిన వ్యాఖ్య

సరిగ పద మని

పంపినవారు :
చల్లా చంద్రమౌళిశాస్త్రి

Photo by M. Natarajan



జడ్. పి. హైస్కూలు,
జగ్గయ్యపేట.

సరిగమపదని

బహుమతి
పొందిన వ్యాఖ్య

# టినోపాల్® సర్వోత్తమ తెలుపు కోసం

**టినోపాల్®-ఎస్**
సింథెటిక్ మరియు
మిశ్రమ దుస్తులకు







**టినోపాల్®**
నూలు దుస్తులకు



® టినోపాల్ సీబా-గైగి లిమిటెడ్ స్విట్జర్లెండ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్‌మార్కు.
సుహృద్ గైగి లిమిటెడ్, పి. ఒ. బాక్స్ 11050, బొంబాయి 400 020

Shilpi SGT. 1A/74 Tel





# సమయోచిత సందర్భాన్ని చెప్పండి
# రూ 50,000 లు విలువచేసే
# బహుమతులు గెలవండి

## ప్యారీవారి "సమయోచిత సందర్భాన్ని చెప్పండి" పోటీలో

**2** మొదటి బహుమానాలు — మీ ఇష్టమువచ్చిన ఆభరణాలసమితి ఒక్కొక్కటి — విలువ రూ. **10,000/-**

**2** రెండవ బహుమానాలు రెఫ్రిజిరేటరుగాని వంట సరంజామగాని ఒక్కొక్కటి — విలువ రూ. **5,000/-**

**50** కన్సొలేషన్ బహుమానాలు — కాంచీపురము చీరలు ఒక్కొక్కటి — విలువ రూ. **400/-**

మీకు దగ్గరలోనున్న డీలరువద్ద పూర్తి వివరములతోగల ఎంట్రీ ఫారములు లభిస్తాయి.




"ప్యారీవారి స్వీట్ బ్లాక్"
మీ అందమైన అట్టపెట్టెలో మీరు అభిలషించే మిఠాయిలు
6 రకాలలో లభిస్తాయి గ్రా 450లు
వెల రూ 12/-లు మాత్రమే.



ప్యారీస్
కన్ఫెక్షనరీ లిమిటెడ్
మద్రాసు.

SAA/PRS/1665R



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు అగష్టు 20వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోష్టుకార్డు పైన మాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు అక్టోబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:

పొద్దుతిరుగుడు పువ్వులు

మూడవ అట్ట:

లిలీ పువ్వులు


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-600026. Controlling Editor: 'CHAKRAPANI'